# చైతన్య కవిత

1

అక్షయ వసంతం

SPRING 1986



సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం



చైతన్య కవితా వేదిక

మైసూరు

# చైతన్య కవితా వేదిక

అధ్యక్షులు : డా. తంగిరాల సుబ్బారావు

కార్యదర్శి : డా. ఆర్వీయస్. సుందరం

కోశాధికారి : డా. సరగు కృష్ణమూర్తి

పోషకులు : శ్రీ సి. ఎన్. రెడ్డి, మైసూరు.
శ్రీ రమణయ్య రాజా, మద్రాసు.
శ్రీమతి ఇందిరాదేవి ధనరాజ్ గిర్, హైదరాబాదు.

జీవిత సభ్యులు : శ్రీ ఎస్. నారాయణ రెడ్డి, హైదరాబాదు.
శ్రీ కె. ఎస్. ఎమ్. ఎన్. శమంతకమణి, అమలాపురం.
శ్రీ సి. హెచ్. రమణకుమారి, రాజమండ్రి.
శ్రీ డి. వి. ధన్వంతరి, చింతలూరు.
శ్రీ బులుసు వేంకట సత్యనారాయణమూర్తి, రాజమండ్రి.
శ్రీ ఎన్. శేషగిరి, రాజమండ్రి.
డా. దివాకర్ల రాజేశ్వరి, బెంగుళూరు.
శ్రీ గొల్లపూడి సుబ్బారావు, విజయవాడ.
శ్రీ వారణాసి వేంకట భానుమూర్తి, విజయవాడ.
శ్రీ పి. యు. బి. శర్మ, రాజమండ్రి.

# చైతన్యకవిత

**1**

అక్షయ వసంతం

SPRING 1986



సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం



చైతన్య కవితా వేదిక

మైసూరు

CHAITANYA KAVITHA a collection of poems
published by Chaitanya Kavita Vedika
T-41, University flats, Manasagangotri, Mysose-6
April 1986, pp. viii + 80.

ముఖపత్ర రచన : డా. పి. సి. నరసింహా రెడ్డి

వెల : రూ. 8-00

*For Copies*:

**Dr. T. V. Subba Rao**
Department of Telugu
Bangalore University
Jnana Bharati, Bangalore-560 056

**Dr. R. V. S. Sundaram**
Department of Telugu
University of Mysore
Manasagangotri, Mysore-570 006

చైతన్య కవితా వేదిక

| | |
|---|---|
| వార్షిక సభ్యత్వం | రూ. 10-00 |
| ప్రత్యేక సభ్యత్వం | రూ. 100-00 |
| జీవిత సభ్యత్వం | రూ. 200-00 |
| పోషకులు | రూ. 500 లకు పైన. |

ముద్రణ ;
మిత్ర ప్రింటర్స్
విద్యారణ్యపురం, మైసూరు-8.

# అక్షయ వసంతం

వసంతాలు వస్తుంటాయి, పోతుంటాయి. ఇది అక్షయ వసంతం. చైతన్య కవితావిర్భావంతో ఇది సార్థకం. ఈ చైతన్య వసంతం రేపటి కవిత్వానికి తలుపులు తెరవాలని మా ఆకాంక్ష.

రాజకీయాలకు, పాక్షికాభిప్రాయాలకు, అర్థంలేని పంథాలకు లొంగకుండా భవిష్యత్కవితాస్వరూపాన్ని నిర్ణయించుకోడానికి ఒక వేదికను ఏర్పాటు చేయాలనే ఆశయమే చైతన్య కవితా వేదిక రూపు దాల్చడానికి దోహదం చేసింది.

చైతన్య కవితా వేదిక ఆశయ కిరణాలలో కవిత్వానికే అంకితమైన పత్రికను నడపడం కూడా ఒకటి. పెద్ద పెద్ద పత్రికాధిపతులే జనాకర్షణ కోసం పిల్లిమొగ్గలు వేస్తున్న ఈ తరుణంలో కవితా పత్రికను నడపబూనడంగొప్ప సాహసమే. ఉన్నత ప్రమాణాలతో కూడిన కవితా పత్రికలు ఏడాదికి రెండైనా తేగలిగితే మా ఆశయం సార్థకమవుతుందని భావించాం. ఈ మహత్కార్యానికి ఆంధ్రదేశం నలుమూలల్నుంచి మహనీయుల సహాయ సహకారాలు లభించాయి. నిరుత్సాహవాక్యాల కన్న, ప్రోత్సాహకరమైన అభిప్రాయాలే ఎక్కువగా లభించి మా వెన్ను తట్టాయి. అక్షయనామ సంవత్సరం ఈ కవితోద్యమాన్ని అక్షర రూపంలో అందిస్తున్నది. ఈ కవితా చైతన్యం అక్షయంగా, అక్షరంగా ఉంటే చాలు. భావితరాలు తమకు కావలసిన రీతిలో కవితోద్యమాలను మలచుకుంటాయి.

కవికి సంఘంలో గౌరవం నాటికీ నేటికీ చెక్కు చెదరకుండా ఉంది. కవితా సంకలనాలు అమ్ముడు పోక పోవచ్చు, పత్రికల్లో కవుల పేర్లే విషయసూచికలో ప్రచురించకుండా అక్కడా ఇక్కడా విసిరేసినట్లు కొన్ని కవితలు ప్రచురించి చేతులు దులుపుకోవచ్చు. కాని సాహితీ వేత్తల్లో కవికి సమున్నత స్థానం ఎప్పటికీ ఉంది.

ఆంగ్ల ప్రాచార్యులుగా పని చేసి, విశ్రాంతి జీవితాన్ని సాహిత్యంకోసం ధారపోస్తూ, మైసూరులో ధ్వన్యాలోకమనే పేరుతో మహోన్నత సంస్థను

స్థాపించిన శ్రీ సి. డి. నరసింహయ్యగారు మమ్మల్ని నలభైరోజులు 'రెసిడెంట్ ఫెలోస్'గా తీసుకొన్నారు. ఆ సమయంలో పుట్టి, పెరిగి, బోధివృక్షమైన ఆలోచనా ఫలితమే చైతన్య కవితా వేదిక. ఆ తర్వాత ఎంతోమంది మిత్రులు, కవులు, పండితులు, శ్రేయోభిలాషులు మాకు అమూల్యమైన అభిప్రాయాలను అందించారు. సోమసుందర్, శేషేంద్ర, సినారె, నగ్నముని, నిఖిలేశ్వర్, తుర్లపాటి కుటుంబరావు, పురాణం సుబ్రహ్మణ్య శర్మ, నండూరి రామమోహన రావు, శివలెంక రాధాకృష్ణ, తిరుమల రామచంద్ర, కె. శివారెడ్డి మొదలైన సహృదయులతో చర్చించి తీసుకున్న నిర్ణయాలు మాకెంతగానో తోడ్పడ్డాయి.

ఎలాంటి మంచి పనికైనా కొండంత అండగా నిలబడే సి. ఎన్. రెడ్డి గారికి, రమణయ్య రాజాగారికి, శ్రీమతి ఇందిరాదేవిగారికి కృతజ్ఞతలు. ముఖ పత్రాలంకరణకు చేయూత నిచ్చిన డా. పి. సి. నరసింహా రెడ్డిగారికి మా ధన్య వాదాలు. మైసూరులో ఈ తెలుగు పుస్తకాన్ని ఇంత అందంగా ముద్రించి ఇచ్చినందుకు మిత్ర ప్రింటర్స్ వారికి ధన్యవాదాలు.

సంపాదకులు

# చైతన్య కవితావేదిక నలంకరించిన కవులు

పద్య కవిత



అనువాద కవిత

యశోధనాన్ని, స్నేహభూషణాల్ని
సాహిత్య సింహాసనాన్ని
ఈ లోకానికే వదలి
హఠాత్తుగా వెళ్ళిపోయిన

డా. టి. బి. యం. అయ్యవారి

దివ్యస్మృతికి అర్పిస్తున్న
క వి తా ం జ లి

# కె. గోదావరి శర్మ

## స్వాగత గీతం

అమ్మ కడుపులో ఉంది
అందమైన పింక్ టెలిగ్రాం.
ఎపుడొస్తుందా అని
ఎదురు చూస్తున్నాం.
ఈ టెలిగ్రాం మాకు శుభలేఖ
మా భవిష్యదాకాశంలో
ఉదయించబోయే శశిరేఖ.
కృష్ణ పక్షపు రాత్రులన్నీ
బహుళ పాడ్యమికోసమే
పరిపక్వమైనట్టు
మా ఇన్నాళ్ల నిరీక్షణా
ఈ శుభ వర్తమానం కోసమే.
దైవ దర్శనమే దివ్యవరమని
దీక్షగా తపించే భక్తుడికి
తక్షణమే దేవుడు ప్రత్యక్షమై
ఇంకా వరాలు కోరుకోమనట్టు,
బ్రతుకులో చీకటి అంతరించి
భావి అంతా వెన్నెల పంటేనని
అభయం ఇచ్చినట్టు—
వస్తోంది ఈ సజీవ శుభవార్త.
రాజకుమారుడు తనకి తానే
రాయబారిగా వచ్చినట్టు,
వి. ఐ. పి. యే వేషం మార్చి
వార్తాహరుడిగా వచ్చినట్టు,
శుభమే లేఖగా వస్తోంది
వభాన్ని భువికి తెస్తోంది.

ఈ అపురూపమైన తంతి
దేవతలు ఆడే పూల బంతి.
మా దాంపత్యాన్ని మెచ్చి
దివి మా కిచ్చిన బహుమతి.
ఈ శుభవార్తా బాలుడు
బక్కపలచటి కాగితం కాదు.
రెక్కవిప్పిన గులాబి మొగ్గ.
కంఠం లేని ఓటి మాట కాదు,
వీణానాదపు తేనెతేట.
అహరహమూ అనుక్షణమూ
తలనిండా కలనిండా
ఒకటే అపేక్ష, ఒకటే నిరీక్ష.
ఎపుడెపుడా ఇంకెపుడా అని
తనువంతా బ్రతుకంతా
శ్రవణేంద్రియమై మిగిలింది,
'కేర్' మన్న శుభవార్త కోసం.
మడతలు విడి రెపరెపలాడే
బుల్లిబుల్లి అవయవాల
గులాబీ టెలిగ్రాం కోసం.
వేసవి ఉదయపు మసక వెలుగుని
పిల్చుకొచ్చే కోయిల పాటలా,
మధ్యాహ్న తాపాన్ని మందలించే
మృదువైన సంధ్యామందమారుతంలా,
మబ్బుల దర్బారుకి కొత్తగా ఎన్నికై
దర్జాగా ప్రవేశించే లేత నెలరాజులా—
అమ్మ కడుపులో ఉన్న
అందమైన పింక్ టెలిగ్రాం
ఎపుడొస్తుందా అని
ఎదురు చూస్తున్నాం.
తీయని భావిని ఊహిస్తున్నాం.
ఈ లోకాన్ని సిద్ధం చేస్తున్నాం.
స్వాగత గీతాలు రచిస్తున్నాం.

# ఇంప్రెషనిస్టు సంధ్య

విచిత్రమైన భావం ఏదో
హఠాత్తుగా స్ఫురిస్తే
హడావుడిగా దాన్ని చిత్రిస్తూ
ఎక్సెంట్రిక్ ఆర్టిస్టు ఎవరో
మధ్యలో మనసు
మార్చుకుని
పని మానుకుని
వెళ్లిపోయినట్టు
ఇవాళ్టి సంధ్య—
అందం చిందరవందర అయినట్టు
ముక్కోణపు కలైడోస్కోపు విరిగి
ముగ్గుల్ని వెదజల్లినట్టు
వికసించిన సర్రియలిస్టు కల
వింత అర్థాల్ని వినిపిస్తున్నట్టు........

ఆకాశపు ఈజిల్ మీద
కలగలిపిన
రంగుల మరకలు:
మైక్రోస్కోపు లెన్సులోంచి
ఎమీబా గుంపుల్లా
అనుక్షణం ఆకారాలు మార్చే
మబ్బు పింజలు....

రోజూ చూస్తున్నదే ఈ భూమి
రోజాలా విరబూసింది సుమీ!
మన మామూలు లోకమే
మలామా చేసినట్టుంది
ఏటవాలు సూర్యుడి మేలిమిచేతుల్లోపడి!
సంజవెలుగుల్లో సామాన్యులు కూడా
విశేషంగా విలక్షణంగానే ఉంటారు....

దూరంగా ఆకాశంలో మాత్రం
దుర్భిణీ వేసి చూసినా నియతి లేదు.
మబ్బు బఫూన్ల మైమ్ అయ్యాక
స్టీలు ఆకాశపు ఖాళీ మూకుట్లో
వెన్నముద్దలు కరిగినట్టు
కదులుతున్నాయి కొంగల బారులు.
రంగుల మబ్బు నురుగంతా
నీలాకాశ సరస్సు పడమటి ఒడ్డున
కొండకెరటాలమీద తైతక్కలాడుతూంది.

ఓపిగ్గా పరిశీలించి చూస్తే
ఆకాశపు మొహంమీద
అబ్సర్డ్ డ్రామా వెనక
కవళికలు మార్చే
కళాకారుడొకడు కనిపిస్తాడు.

బహురూపి హావభావాలు
బయటపడ్డ మన మనోభావాలు.
ఆకాశపు రంగస్థలం
మన అంతరంగాలకి
ఆబ్జక్టివ్ కో-రిలేటివ్.
అస్తమించే సూర్యుడు
వెండిమబ్బు మీసాలమీద
నిలబెట్టిన నిమ్మపండు.
ఆ వెనక వచ్చే చంద్రుడు
ప్రేమ కళల్ని ప్రోత్సహించే
నవయువతకు నాయకుడు.

ఇంతకీ
ఇవాల్టి సంధ్య
అపక్వమైన ఆధునిక కళారూపమా,
సనాతన సంధ్యాసుందరి
సాభిప్రాయ మందహాసమా?

# మాదిరాజు రంగారావు

## నాకు జ్ఞాపకం ఉంది

### 1

నాకు జ్ఞాపకం ఉంది
ముందు ఏముందో తెలీని ప్రయాణంలో
వర్తమాన ప్రతిక్షణం ఒక్కొక్క మౌన దీపమై
చూపించే దారిలో అడుగు తీసి అడుగు వేస్తూ
ఉదయంపై ఆశతో రాత్రి గడుస్తూనే ఉంది.
చరిత్రలో వెలుగు ఉన్నా నలువైపులా
సుదీర్ఘమైన నీడల సన్నాహమే ఎక్కువ,
ఇక్కడే నిలుస్తాయి అజ్ఞానమూ దారిద్ర్యమూ
కన్నీటి మెరపులో తళుక్కుమంటుంది మృత్యు రహస్యం

స్వేచ్ఛనూ మానవతనూ వ్రేలాడ దీసి
బెంజ్‌మన్ మొలాయిడ్‌ను ఉరి దీసిన రేడియోవార్త
ఆర్తి నిండిన ఆగ్రహంతో టి.వి.లో దృశ్యం
నియంతల్ని శపించే మాతృ హృదయ నిర్ఘోష!
హిమ హృదయంపై ఒక శిఖరం నుండి మరో శిఖరానికి
మధ్యరక్త బిందువులొలికే శిరస్త్రోరణాల పంక్తులు
ఒక్కొక్క బిందువులో ఒక్కొక్క సూర్యగోళం
ఒక్కొక్కటీ చెప్పేను ఒక్కొక్క విషాదగాథ

ఎక్కడ మానవతను జ్వాలలు ముట్టినా
నన్ను రగుల్కొని దహిస్తున్నట్లుంటుంది.
ఎప్పుడు ఆత్మ బింబాన్ని నీడలు క్రమ్మినా
నన్ను చుట్టు ముట్టి పీడిస్తున్నట్లుంటుంది.
ముష్టి యుద్ధం నుండి మిసైల్ ప్రయోగంవరకూ
శాపం నుండి హత్య, ఉరి శిక్షదాకా
మానవ చరిత్రలో రక్త చిత్ర మరణ దృశ్యాలు
ఆతనిలో వీడని ఆటవిక పురా ప్రతిరూపాలే

2

నాకు జ్ఞాపకం ఉంది
నిశ్శబ్దంగా సాగి పోయే స్రవంతి వలె
మనిషి జీవితంలో కదలి పోతుంది వయస్సు
ప్రతి క్రియలో బింబిస్తూ స్పష్టంగా
వర్తమాన సమాజంలో ఎదుగుతూంది తరం
సిద్ధంగా ఉంటుంది వెనకనే తరం
ఆపై దూకే అలల వలె తరం తరం
ముఖంలో చరిత్ర కవసరమైన ఊహలతో
ఊహలో భవిష్యత్తు నిర్దేశించే దిక్కులతో,

గుహలో నిద్రించీ నదీ తీరాన వసించీ
చరిత్రను చీల్చి పై కెగరవేసే అహంతో,
చరిత్రవంతుడు కావాలనే మహదాశతో
విలువలు మారుస్తూ యుగాలు నిర్మించాలనే
మనిషి గుండెలో రూపొందే రక్త చిత్రం వేరు,
హృదిలో ఉదయించే మానవత ప్రక్కనే
జ్ఞాపకం లేకపోలేదు చీకటి ఆవేదన!

తనవద్ద జరిగే బలాత్కారం చూచి
పూలు పూయడం మానలేదు తోట
తన నీడలో జరిగే హింసను చూచి
చివురు వేయడం ఆపలేదు చెట్టు
మనిషికి సహజం ఆకలితో పాటు సంవేదన
ధూళి నుండి పైకెగసే అగ్ని తత్త్వమూ.
తూనిక రాళ్ళతో కొలిచే జీవితానికి
అందదు త్యాగం కోరే ఉదారలక్ష్యం!

# అద్దేపల్లి రామమోహనరావు

## గుండెలో సముద్రం

నా గుండెలో నిద్రపోతోందొక సముద్రం
అప్పుడప్పుడు ఆ సముద్ర కెరటాల కలవరింతలు
నా కళ్ళ వెనక ఆకాశాల్లో ప్రతిధ్వనిస్తూ ఉంటై
అప్పుడప్పుడు ఆ సముద్ర కెరటాల గాలి వేగాలు
నా నెత్తురు కాలవల్లో సుడిగుండాలై తిరుగుతూ ఉంటై—

ఆ క్షణాల్లో నాలో
సముద్ర ముందనే స్ఫురణ తప్ప
మిగిలిన సమయమంతా
నీటిని మరిచి పోయి
గాలిలో ఎగురుతున్న మబ్బుతునకలాగా
కాలాకాశంలో కదిలిపోతూ ఉంటాను.

తోటి మానవులతో పాటు నేనూ ఒక తరంగాన్నై
ఈ సమాజ ప్రవాహంలో లేచి పడుతూ ఉంటాను.

ఉదయించే సూర్యుణ్ణి ముద్దు పెట్టుకొని
మండుతున్న పెదవులతో అక్షరాన్ని అగ్నిగుండాలుగా మార్చి
సమాజ దుష్టశక్తుల్ని పరిమార్చడానికి
నెత్తురుతో నిప్పుల జండాలెగరేస్తూ ఉంటాను—

ఇంద్రధనుస్సుల్ని శిరస్సుమీద మెరిపిస్తూ
కాలకన్య కదిలిపోతుంటే
ఆమెను మోహించి వెనక పరిగెత్తే నా కళ్ళ చీకట్లు
ఆ యింద్ర ధనుస్సు రంగుల్ని ముయ్యలేక ముక్కలు కాగా
ప్రతి ముక్కలో నా ఓటమి నన్ను వెక్కిరిస్తుంటే
బ్రతుకు బాటలో ప్రతి అడుగునా మూర్ఛ పడుతున్నాను
తేరుకుని మళ్ళీ కాలకన్య అడుగుల కింద
నా కోరికల మడుగులు పరుస్తున్నాను

జీవితపు పరుగు పోటీలో
ఒళ్ళు మరిచి పోయి పరుగులు పెడుతూ
నా గుండెలో తొణికిస లాడుతున్న సముద్రాన్ని
గుర్తించ లేక పోతున్నాను
ఆ సముద్రపు హెూరులోని చైతన్య ఘోషని
వినిపించుకోలేక పోతున్నాను.
ఎప్పుడో ఒక రోజల్లా సూర్యుడితో పాటు ప్రయాణంచేసి నే నలిసిపోయి
ఊరి చివరి సంధ్యగట్టుమీద ఒంటరిగా వగరుస్తూ వాలిపోయి
పడమటి వెనుక రహస్యంలోకి జారిపోతున్న సూర్యుడు
ఎఱ్ఱని నిశ్శబ్దం నా గుండె మీద ఫిరంగులై పగుల్తున్నప్పుడు—
నా గుండెనుండి నా ప్రజల గుండెల్లోకి
ప్రవహిస్తున్న అనుబంధపు వాగుకి
ఎప్పుడో ఒక క్షణాన వరద వచ్చి పొంగిపోయి
కట్లు తెంచుకొని పార్లి పోయినప్పుడు
ఎక్కడ ఏ రీతిగా వేదన ప్రత్యక్షమైనా
అది నా నరాల్ని పిండి కళ్ళనుండి అగ్ని బాష్పాలు రాల్తున్నవేళ
ప్రతి బాష్పంలో సముద్ర వియోగం
వెయ్యినోళ్ళతో అరుస్తున్నప్పుడు—
అప్పుడు ఆకాశమంటుతుంది నా గుండెలోని సముద్రపు హెూరు
ఆ హెూరులో కనరాకుండా కరిగి పోదామనుకున్న మరుక్షణాన
నాలో నేనిమడక లోలోపలికి జారిపోతున్నాను
నాకు తెలియకుండా నేను నాకు దూరంగా పారిపోతున్నాను—
ఈ జారు పాటునుండి తప్పించుకోడానికి
నా చైతన్యాకాశంలోని పగలు రాత్రులు
చేతుల్లో ఎఱ్ఱటి కాగడాలు పట్టుకుని
నిరంతర సంఘర్షణలో నిమగ్నమవుతున్నై—
ఆ ఎఱ్ఱని కాగడాల స్పర్శతో
ఎప్పుడో నా గుండెకు నిప్పంటుకుని
క్షణాలన్నీ నా గుండె చుట్టూ
దీప తోరణాలై వెలగాలని
తపిస్తున్నాను
ఎదురు చూస్తున్నాను--

ఆ వెలుగులో నాలోని అంధకార గుహాద్వారాలు ఛేదించుకు పోయి
నా గుండెలో మేలుకున్న సముద్రం
లోకం మీదికి ఉప్పెనగా ఉరుకుతుంది
సమిష్టి చైతన్యం సూర్యునిలా వెలుగుతుంది—
అప్పుడు
నా నెత్తురులో ఈ సమాజపు నీడ చూసుకుంటాను
హృదయంలో నా ఎదురుగా నేను కూర్చుని
తృప్తిగా నవ్వుకుంటాను.

## యస్. యమ్. వి. ఆర్. జి. కృష్ణస్వామి

### చైతన్య దీపిక

శీతకాలపు చలి రాక్షసి కోరల్లా
జీవన కఠోర సత్యాలు ఎముకల్ని కొరుకుతున్నా—
మనిషిని మరిగిన వ్యాఘ్రంలా
రేగిన నైరాశ్య భావన
రక్తమాంసాలను పీల్చి పిప్పి చేస్తున్నా—
అణువులో అణిగియున్న పరమాత్మ తత్త్వపు దివ్వెలా,
ఎక్కడో నాలో నాకే అంతుదొరకని చోట,
జీవన తత్త్వపు చైతన్య దీపిక—
రవ్వలా మెరిసి, రివ్వున పైకెగసి,
విశ్వాంతరాళాల వెలుగు జిమ్మాలని,
వెర్రిగా వేచి చూస్తోంది
ఆరిపోనని మొండికేస్తోంది.

# శేషేంద్ర

## వీరుడు

చంపి కొండల్లో పారేసిన వాడి శరీరం
రాగంకోసం బిగించిన ఫిడేలులా
పడి ఉంది
వాడి నోరు పాడిన పాటలు
ప్రవహించే నదులు ఆగి ఆలకించేవి
చావు లేని వాడ్ని చంపిన మూర్ఖులకు
తెలీదు
ఏ మృత్తిక పువ్వును మనిషికి కానుకగా
ఇచ్చిందో అది
వాడి నిర్మాణంలో ఉందని.

## రాత్రి

చీకట్లో మునిగిన చెట్ల కొమ్మల్లో
మిణుగురు పురుగులు జ్ఞాపకాలై
ముసురుకున్నాయి
నిద్ర షట్టక గ్రామం
ఎడ్లు కదలించే మెడగంటలు
వింటోంది
గడ్డివాముల మౌనం మీద
నక్షత్రాలు రాలుతాయనిపిస్తోంది
కంటికీ కలకూ
ఒక రాత్రి అడ్డంగా ఉందని తెలిపింది.

## నాయకుడు

సముద్రాన్ని తెచ్చి మా తోటలో
పెట్టమంటాడు
నక్షత్రాన్ని తన గుండీగా కుట్టమంటాడు
కవిత్వ పుస్తకాలతో కాఫీ కాచుకుంటాడు
మన నాయకుడు దేవుడ్ని కూడా ఇలావచ్చి
పొమ్మంటాడు.

## చేతన కోసం

ఈ నేల ఒక జ్వాల అవుతుంది
అవుతుందొక బ్రహ్మాండ శతఘ్ని
నిశ్శబ్దంగా ఉన్న శతాబ్దం
నిగళాలు త్రెంచుకుని నిలుస్తుంది
జీవన కుహరంలో స్పందించే
ధ్వని బద్ధలై భూమి దద్దరిల్లుతుంది
పిడికెడు మట్టికోసం కాదు
ఒక పుట్టుక కోసం ఒక చేతన కోసం
గాలి కోసం కాంతి కోసం
గగనంలో కెగిరే రెక్కల కోసం....

## విఖిలేశ్వర్

### సూర్యాన్వేషణ

గోదావరి కాలువల పొడుపునా
కొబ్బరి నార పిండే చెమటలో
రాటుదేలిన చేతుల్లో భుజాలపై
ప్రతిరోజూ పాగే సరకుల పడవల వెనక
చిన్న చిన్న వంతెనల జీవన వారధుల కింద
ఎర్రగా లేచి అస్తమించే ఆ సూర్యుడే;

కృష్ణానది పాయలలో
ఊరు–వాడలకు ఊపిరి పోసే నీటితో
కాగే ఎండలో ట్రాఫిక్ పోలీస్ చేతిలో
జీవితాంతం రక్తం కరిగించే రిక్షా జీవితాల్లో
రోజూ నిద్రలేచి
హడావిడిగా వెళ్లిపోయే ఆ సూర్యుడే;

బంధించిన మహానగరం శివార్లలో
ఎండిపోయినా– అప్పుడప్పుడు
పిల్ల గంతులేసే మూసీ నది నీటిలో
వ్యాయ స్థానాల కోటల వెనక
శ్మశానాల ఎగిరే బూడిదలో
ఆ నాటి నిజాంనుంచి ఈ నాటి దాకా
ఖానిస బతుకుల్లోనే
రెక్కలు ముక్కలయ్యే బాటల్లో
ప్రతిరోజూ బద్ధకంగా వొళ్లు దులిపి
మళ్లీ శిథిలాల్లో పడుకునే ఆ సూర్యుడే;

ఇంకా పాలించే పాత జెండాల పైన
వాగ్దానాల రంగుల కొత్త జెండాల మీద
లోలోన భగ్గున మండినా

నగరాల నరాల్లో మరిగే శ్రమ శక్తిలో
మారుమూల గ్రామాల మట్టిలో
మేల్కొంటున్న నిప్పుల రవ్వల్లో
న్యాయం జరిగే దాకా
ఎక్కడా అసలే అస్తమయం లేని
మనందరి ప్రతిరూపం ఆ సూర్యుడే!

## చరిత్ర నిర్మాతల చేతులు

ద్వేషవు పడగ నీడ కింద
ఎవరైనా ఎంతకాలం పడక వేసుకోగలరు?
కొందరు పెంచుకున్న
తరతరాల పవిత్ర సాంప్రదాయాలు
ఆ కొందరికే నీడనిచ్చే మర్రిచెట్టుగా మారితే
ఆ నీడ కూడా దొరకని అదృష్టహీనులు
నిట్ట నిలువునా నరక బడుతుంటే
నేల తల్లికి దూరమై తల్లడిల్లి తిరిగి
విముక్తికోసం ఈ నేలలోంచి మొలిచిన చేతులతో
దళితులు– ఆఫ్రికన్‌లు– పాలస్తీనియన్‌లు!

శతాబ్దాల తరబడి
తరతరాల శాంతియాత్రల్లో
మౌన ముద్రల్ని చెక్కిన శిల్పులు
కనీసం గడచిన ఈ దశాబ్దాల వెంబడైనా
ఉలుల్ని నిద్రలేపి రాజీలేకుండా
సాగి పోతున్నారు ఉగ్రమూర్తులుగా!

ఈ వ్యవస్థ పెత్తందార్లు అదిలిస్తే
గాలికి ఎగిరిపోయే పూచిక పుల్లల్లాంటి వాళ్లు
కనీస చట్ట పరిధిలోనైనా
నిలదొక్కుకునే లోగా
ఎన్నో ఉప్పెనల సుడిగుండాలు
రైలు ప్రమాదాల వావు ప్రయాణాలు!

ఎక్కడైనా ఏ వావుకైనా
అతి తేలిగ్గా బేవార్సుగా దొరికేవాళ్ల
ఉద్యమ గర్భాల్లో దాగిన అసామాన్యులు
మానవ చరిత్రనే నడిపించే అణుశక్తులు.

ఆ సామాన్యులే
ఎవరో ఒక వీరుడి కోసం
ఎంతో కాలం ఎందుకు పడికాపులు పడిచస్తారో
ఏ చరిత్రా వివరించదు!

తమ ఆకలి బాధల చుట్టూ బతికే
రాబందులను గుర్తించి తరిమేసే
అనంతమైన ఆ మూకుమ్మడి శక్తికి
ఆయా దశల్లో చైతన్య దీప్తిని రగిలించే
చారిత్రిక పురుషులే సామాన్యుల సంతతి.

అదను చూసి పడగవిప్పే
కులమత విద్వేషాల కిందికి
తరుముతున్న నికృష్ట నియమాలను
నిలువునా పాతిపెట్టే చేతులు
అతి సామాన్యమైన ఆ చరిత్ర నిర్మాతలవే!

ఆ చేతులే ఒకనాటి బానిసలవి
—స్పార్టకస్‌వి,
బందీలైన భారతీయులవి
—భగత్‌సింగ్‌వి,
వీర తెలంగాణా రైతాంగ యోధులవి
ఇప్పుడు విశ్వమంతా
వ్యాపించిన శ్రమవీరులవి.

# గుమ్మనూరు రమేష్‌బాబు

## ఏమంటావ్?

అనంత రసదాయివై
అనుభూత ప్రదాయివై
నాలో నిలిచిపోరాదా?
నిశాంత నిర్ఝరివై
నిండుగ ఆవరించిన ఈ శార్వరిని
నా గుండెల్లోతుల్లోంచి పెకలించి వెయ్యరాదా?

నిరంతర నిర్దేశివై
పడగలు విప్పుతున్న స్వార్థదర్వీకరాన్ని
నీ వామ పాదంతో మర్దించకూడదా?

అంతరాత్మ ప్రబోధానివై
ఏకాంతంలో నన్ను కబళించే నిర్వేదనాన్ని
నీ చల్లని మాటతో మట్టుపెట్టరాదా?

మన కలయికలో
ఎన్నో మంచిరోజులు రానీ!
ముందు కాలంలో
మన గురించి అందరూ మంచిగా చెప్పుకోనీ!

# మంతెన సూర్యనారాయణ రాజు

## ఎండ మావులు

సూక్తుల గంధపు చెక్కలు
మోసాల సానలమీద అరుగుతుంటే
నీ పద్ధతి మార్చుకుంటూ పోతావా?
అబద్ధం ఎండకు నిజం గొడుగు పడితే
నిజం తెలిస్తే నీ బ్రతుకు
ఆ ఎండకు మాడిపోతుంది.

## లౌక్యం

నమ్మే వాడున్నప్పుడు
నా అంతటివాడు లేడంటాను
కుమ్మే వాడున్నప్పుడు
నీవే నాకు గురువు అంటాను.
లేకపోతే
ఈ లోకం బ్రతకనివ్వదు.
ఈ లోకం విలువివ్వదు.
అవతార్ బీర్ బాబానైన నేను
వస పిట్టకు వాగుడు నేర్పుతాను
కొమ్ములు మీరు దాచుకొని వస్తే
రొమ్ము చూపి నేనే మిమ్మల్ని కుమ్ముతాను.

# రఘువర్మ

## కల్లాకపటం లేని నోళ్ళు

కల్లాకపటం లేని నోళ్ళు
మనకున్న రెండు కళ్ళు!
నీతీ నిజాయితీలకు
అచ్చంగా ఇవి పుట్టిళ్ళు!

హృదయాలకు ఇవి
అద్దం పడతాయి
దాగుడు మూతలకు
శ్రాద్ధం పెడతాయి!

తడబడకుండా పలకడానికి
వీటికుంది వర్ణరహిత భాష
భావాల కనుగుణంగా మారే
రంగులే వీటికున్న ఆశ!

వాడి చూపుల గాలాలకు
ఇవి చేపల్లా పడతాయి
వేడి నిజాల్ని నూటికి నూరుపాళ్ళూ
నిక్కచ్చిగా ఇవి చెబుతాయి!

ద్వ్యర్థంగా మాట్లాడటం
అసలు వీటికి రాదు
అరువు తెచ్చుకున్న మూగతనమంటే
వీటికి కటికి చేదు!

స్వచ్ఛత కోసం కాబోలు
వీటిని తుడుస్తుంటా యెప్పుడూ కంటిరెప్పలు.
అందుకే ఉండవు సాధారణంగా
వీటిలో ఏ మబ్బు తెప్పలు!

ఈ కళ్ళు మాట్లాడే ప్రతిమాటా
శుభ్రంగా స్నానం చేసి వస్తుంది 'నీట'
నవ్వుకైనా, ఏడ్పుకైనా
'కన్నీరే' వీటి సూటిమాట!

## ద్వా. నా. శాస్త్రి

### వేడే చూడండి

ఆధునిక రాజకీయ 'చలన చిత్రం'లో
ఓటు హక్కున్న ప్రేక్షకులు
ఎన్నుకొన్నవాడే నాయకుడు.
వదలకుండా 'ఉడుంపట్టు'
పట్టే పదవి నాయిక.
అయిదేళ్ళకోసారి అందించే
ఉపన్యాసాలు—
'జయమాలినీ' విన్యాసాలు!
విలన్ ఎవరో కాదు........
అడుగడుగునా అడ్డుతగిలే
అసమ్మతివర్గ నాయకుడే.
నిరక్షర భజన బృంద గాయకులున్నంత వరకు
కథ సుఖాంతమే!
ఈ చిత్రం 'సూపర్ హిట్' కూడా అవుతుంది.

## సి. నారాయణ రెడ్డి

### రెండుగట్లు

కాలం అంచుమీద నిల్చుని
లోకం లోతుల్ని చూస్తుంటే
కనిపించే లోయలు
అనుభవాల ఆత్మహత్యలకు
నిప్పంటించే నీటిపాయలు.
నా మనసు జీవనది
ఆ గట్టున అధికారం
ఈ గట్టున మమకారం.
కుమ్ముకునే రెండుగట్లను
కుట్టేసే దారం
ప్రవహించే అభ్యుదయానికి
ప్రతీకలాంటి కాలం.

## కె. కిశోరుబాబు - కె. అశోకుబాబు

### రెండూనూ!

అసూర్యం పశ్యల్ని చేస్తున్నది
పురాతనాచారాలలోని 'కట్టడి'
అంగడి బొమ్మలుగా మారుస్తున్నది
నవీన నాగరికతలలోని 'విచ్చలవిడి'
అబలల జీవితాలకీ ప్రస్థానాలు
రెండూనూ
యమగండాలే!
సుడిగుండాలే!

# చల్లా రామఫణి

## దగాది

ఎంత దగా చేశావు ఉగాదీ!
ఎన్ని పండుగలకి కవిత్వాలు రాసినా
నువ్వొస్తున్నావని, ఏదో 'కొత్త' తెస్తావని
ఈ జనాలకి నచ్చచెప్పి జోకొట్టకపోతే నాకు నిద్రపట్టదు!
అసలే గోతాలతో చేసే అప్పులకి,
గొప్పల తిప్పలతో తట్టుకోలేని జీవితాలకి, జీతాలకి
కుదరని సమన్వయానికి గిలగిల్లాడుతూ
నిద్రాదేవి దరికిరానని నీల్గుతోంది!

గోతాలతో చేసేవాగ్దానాలు నిదానంగా విని
విసిగి, వేసారి ప్రతిఘటిద్దామనుకుంటూనే
ఓట్ల పండగకోసం ఎదురు చూసి
ఈస్ట్‌మన్ కలర్ జలగల్ని ఎన్నుకొని
ఎన్నికలయ్యాయనిపించే పిచ్చిజనం జోలికి,
నీరు లేక కరువుతో ఎండి
కన్నీటి చారికల బరువుతో నిండిన
జనం బతుకుల ఊపిరితిత్తులనే పూలగుత్తులుగా
ప్రజాస్వామ్యం సమాధి మీద ఉంచే
వంచనా శిల్ప రాజకీయులకు జడిసి
నిద్రాదేవి ససేమిరా సరసకు రానంటోంది!!

అరవై పేర్లతోనే నువ్వు గిరగిర తిరుగుతూ తిరిగొస్తుంటే
మా కవికులమంతా స్వాగతకవితా కుసుమాల మాలలతో
సత్కరిస్తున్నారని సంబరపడిపోయి
నువ్వు భ్రమతో దిగ్భ్రమ చెందినా సరే!
నువ్వు దగా చేశావంటాను ఉగాదీ! దగా చేశావు!!

నింగినెత్తినెక్కి ధరలు దిగిరామని మొరాయిస్తున్నాయ్!
ప్రజాస్వామ్య పత్రికలో ముప్ఫయ్యేనిమిదేళ్ల క్రితం మొదలైన
వాగ్దానాల సీరియల్ శాఖాచరుని వాలంలా విస్తరిస్తూ
విసుగెత్తిస్తూనే ఉన్నా;
గొౖత్తైతోకలా 'ఆచరణ' ప్రణాళికల సేఫ్టీ లాకర్లలో
నిదరోతూనే ఉంది!!

కాలం కన్నీటి కెరటాల మీద రాతలు రాస్తూ
నిన్ను ఉబ్బేసి పత్రికల్లో ప్రత్యక్షం కావాలనుకునే
పండిత ప్రకాండులకు నీవు లొంగిపోవడం చూసి చూసి
నేను పండిపోయాను!

చర్విత చర్వణంగా నువ్వొస్తూనే ఉన్నావు!
ఎటువంటి నిరోధాలు లేకుండా యాంత్రికంగా
మేము కవితల్ని కనే యంత్రాల్లా
ప్రతిరోజూ కవిత్వాల్ని వివిధ సైజుల్లో ఉత్పత్తి చేస్తూ
ఉపయోగం లేకున్నా ఉత్పత్తి లక్ష్యాల్ని అధిగమిస్తున్నామ్!

యాంత్రిక భూతం కోరల్లో చిక్కుకుని
ఇరవయ్యొకటో శతాబ్దివైపు లక్ష్యం లేకుండా
దూసుకు పోయే సుడిగాలిలో చిక్కిపోయి
నీలాంటి పర్వాల గర్వాలన్నీ హరించుకుపోయాయి!
ఇంగ్లీషు చదువుల ఎండమావుల్లో మునిగి తేలుతున్న మాకు
నువ్వే పేరు పెట్టుకుంటే ఎవడిక్కావాలి?

నువ్వు కూడా మా బతుకుల పాలిట మరో జలగలా
దాపురిస్తావని మేమూహించలేదు!
ఈ సమాజ న్యాయస్థానంలో నీలాంటి వాళ్లందర్నీ
నిత్య నేరస్థులుగా నిలబెడతాను
నీవు అఖండ జ్యోతివై హారతులందుకున్న
మనసుల్లోనే నిన్ను ఉరితీస్తాను!
ఆర్భాటాల్లేని ఆనందాల సిరులు పూయిస్తాను!!

# సౌభాగ్య

## పన్నెండు గంటల రాత్రి

పన్నెండు గంటల రాత్రి
పెన్ను నిండా సిరాఐ కాగితం మీద కన్నీళ్ళు వదుల్తుంది.
పన్నెండు గంటల రాత్రి
ప్రశ్నల్ని మోసుకొచ్చి గుండెమీద జలజలా రాల్చి
చల్లదనాన్ని మోసుకుని గాలిలా సాగిపోతుంది.
మేఘాలు నిండిన రాత్రి
నల్లని తల నిండా నాలుకలు చాస్తూ మెరుస్తుంది.
మనసు తపిస్తుంది. తపస్సు చేస్తుంది.
రెప్పపడని కంటినించి రేపటిలోకి చూస్తుంది.
"తెల్లవారితే ఇంకో కొత్తదినం మొదలవుతుందనా?
ఇంకొన్ని కొత్త సమస్యలు కుసుమిస్తాయనా?"
"కాదు కాదు"
కొత్త సమస్యల్తో బాటే కొత్త పరిష్కారాలు కూడా
కొమ్మలు తొడక్క పోతాయా?
"ఐతే మరి అర్ధరాత్రి మూగ దీపం ముందు మౌనరాగమెందుకు?"
"మరి అందరూ నిద్రపోతే ఆలోచించే దెవరు?"
ఇంత చీకటిని వడగట్టి ఇన్ని కోట్లమందికి
కాంతి కాఫీని కలిపిచ్చేదెవరు?
అందుకే పన్నెండు గంటల రాత్రయినా పడుకో బుద్ధిపుట్టదు.
పగలుకూ రాత్రికీ మధ్య
వలిగిపోతూవున్నా నమ్మకం చావదు.

## చివరకు మిగిలేది

ఎప్పుడో? కలలకి కాళ్ళు వచ్చే దెప్పుడో?
వర్షానికి పచ్చని ఈటెలు లక్షలుగా భూమిని చీల్చుకొచ్చినట్లు

ఈ కప్పల తడిక జనాలకి క్రమశిక్షణ అలవడే దెప్పుడో
అంతవరకూ ఎవరికి వారే యమునా తీరే
ఒక్కో మనిషి కదలిపోతున్న అల! దూరంనించీ చూస్తే ఛేదించలేని శిల!
నమ్మకాల నాగబంధాలతో ప్రతివాడూ ప్రగల్భిస్తాడు
కారుణ్యంతో గుండెలకి హత్తుకుందామనుకుంటే కసుక్కున కడుపులో కత్తి
దింపుతాడు
జీవన పోరాటంలో ప్రతిమనిషీ ఝంఝా మారుతమే!
మనుషులు భూతాలు ఆవేశించినట్లుంటారు.
కొందరికి మంత్రాలు పని చేస్తాయి; కొన్ని చోట్ల మంత్రాలకు 'చింత'లు రాలవు.
నడలి పోతున్న వడలి పోతున్న సమాజ వృక్షానికి ప్రవక్త ఎవడోవచ్చి
ప్రకృతి వైద్యం చేస్తూ మధ్యలోనే మాయ మవుతాడు
సమాజానికున్నంత వయసు సంస్కర్త కుండదు.
కొత్త మరమ్మత్తుదారు వచ్చేంతలో కొల్లలుగా కుక్క మూతి పిందెలు.
మానవత్వమూ పెరుగుతోంది. మహమ్మారి తత్వమూ పెరుగుతోంది.
మనిషి మూసిన గుప్పిటి! టెలిస్కోపులో చూస్తే తేలే దేమీవుండదు
దగ్గరకు వెళితే మేఘాలు కనిపించనట్లు! ఐనా బతుకు బతుకే! బాధల గుటకే!
తలతిక్క కానంతవరకు తాత్త్వికతతమాషాగానే వుంటుంది.
అవసరాలు అంతర్మధన చేయించనంతవరకు అలౌకిక చింతన అనుభూతి
లాంటిదే
కోటి చేతులు చీకటి వేళకి ఆకటితో
నోటి దగ్గరకు అన్నం తీసుకోడాన్ని వూహించుకో!
కోటి చేతులు ఇంకో కోటి చేతుల్లోకి
పులకింతల పూలు పూయిస్తూ కలసి మెలసి పోవడాన్ని వూహించుకో!
కోటి పిడికిళ్ళు క్రమ శిక్షణతో కోరలు సాచిన కోడెనాగులై
భుక్తి కోసం బుసలు కొట్టడాన్ని బుద్ధికి తెచ్చుకో
అన్నీ వున్నా అన్నిటికన్నా
అద్భుతమైన ఆరాటం వుంది. అసదృశమైన పోరాటం వుంది.
గానుగెద్దు బతుకులో గ్రెనేడ్ లాంటిది ఆరాటం
చలనం లేని సమాజంలో సైనేడ్ లాంటిది పోరాటం.

# భువనగిరి నాగరాజు

## అక్షరాభ్యాసం

ఆవేదన—
చీకటిలా అలముకొంటుంది—
అలమటించకు
అది నీకు పుస్తకమౌతుంది.
సానుభూతి—
కత్తిలా గుచ్చుకొంటుంది—
కుంగిపోకు
అది నీకు కలమౌతుంది.
ఆవేశం—
లావాలా పెల్లుబుకుతుంది—
అడ్డు పెట్టకు.
అదిసిరాయై నిండి పోతుంది.
గుండె—
అనుభవాల కాసారంలో
కమలంలా విరబూస్తుంది—
అలక్ష్యం చెయ్యకు
అది నీకు గురువవుతుంది—
ఈ జీవితారణ్యంలో
పచ్చదనం పరవళ్ళు తొక్కే
పూలతీగెవై ఎదిగే
చదువు నేర్చుకోవడానికి.
పరిమళం జాలువారే
విరులను బడిలోలాలించే
జ్ఞానం అలవరచుకోవడానికి.

# ధారా రామనాథశాస్త్రి

## నాదగేహిని

చీకటి ముద్దల కడుపున
చిక్కని వెలుగున్నదనీ
జడమనబడు వస్తువులో
చేతన స్పందించుననీ
కదలే మాటల మాటున
కలనాదము కలదనీ
ఊపిరి పీల్చెడు తావున
ఓపిక ఓంకారమనీ....
నాకు తెలియని నాటినుండియు
నాద మీధర నిండియున్నది
నాకు తెలిసిన నాటినుండియు
నాద మీధర నిండుచున్నది.

మరల మరల తలయెత్తును
వసంతమున నొక మహత్తు
పూలలోన గాలిలోన
చింతలోన చిగురులోన
తెలివెన్నెల పొరలలోన
చెలికన్నుల తేటలోన
సౌశీల్యం, సౌహార్దం
సాహిత్యం కలియుచోట
ఉల్లమ్ముల నుప్పొంగును
యుగయుగాల నొకేపాట
ఏ యుగాది కదేపాట
ఏ యుగాది కదేబాట
కథలో విన్నది కాదది
మదిలో నున్నదియే అది

మరల మరల పేరు మారును
నేడక్షయ దాని పేరు
మరల మరల మారు పేర్ల
మాటున అది శ్రీ చేతన

ఆమె పలికిన నీవు పలికెద
వప్పుడామెయ పరావాక్కు
ఆమె కదలిన నీవు కదలెద
వామె పేరానంద దుర్గ
ఆమె నవ్విన నీవు నవ్వెద
వామె పేరానంద లక్ష్మి
ముప్పురమ్మల మూలమైనది
నవ్వుటమ్మల నాదగేహిని
అణువు మొదలా బ్రహ్మగోళము
నాహరించిన దామె లాహిరి
ఎప్పుడో కనువిప్పు నీయెద
నివురు గప్పిన నిప్పురగిలిన
అప్పుడది రసభావ వాహిని
అటుపైన ఆనంద వాహిని.

## జి. ప్రభాకరస్వామి

### దగాపడిన ఉగాది కోయిల

వనాలుండ వలసిన చోట
భవనాలు చూసి
వసంతం చిగురులు
అమ్మకం సంతలో చూసి
పాటపాడుదామని వచ్చిన
కోయిలమ్మ ఒకటే పరుగు
వదిలి వచ్చిన తన గూడు
పదిలంగా వుందో లేదోనని.

## డి. రాజేశ్వరి

### అహం భావం

నా సింహాసనం
దిగివచ్చాక
తెలిసింది
ఆరు బయట వెన్నెట్లో
చంద్రకిరణాలు
అందరితో
పంచుకొని తినవచ్చని.

నా సామ్రాజ్యం
త్యాగం చేస్తేకాని
దర్శనం కాలేదు
సృష్టి కళ్ళల్లో
సమతా భావాలు.

నా కోట విడిచి
బయట కాలూనగానే
నను కౌగలించిన
కోటి క్రొత్త గొంతుల
పాటతో
పాట కలిపి
కదిలాయి
అధ రాధరాలు.

### నక్షత్ర దాహం

హృదయ బిందువు చుట్టూ
గీసుకొన్న సంకుచిత వలయాలు
మహానగరంలో ఎత్తైన భవనాలు

జరుపుకుంటాయి
ప్లాస్టిక్ తోరణాల పండుగలు.
కళ్ళకు
ధరించి
నల్ల కళ్ళద్దాలు
పెదవులకు పులుముకున్న
చిరునవ్వుల రంగులు
నాలుక చివర
అతికిన మాటలు
పారేసుకొన్నది
వెతకాలని
మరచిపోయిన భ్రమలు.

యంత్రాలతో పరుగులు తీసి
బతుకు పందాలు గెలిచిన వాళ్ళు
మనసుకు మనసెదురైతే చాలు
మరొక సారి జీవించాలని
క్రొత్త కలలు కంటారు.

## ఎస్. శ్రీనివాస్

### చెట్టు

గుబులుగా చెట్టు
గుండె దిగులుగా చెట్టు
గుండెలోంచి మొలుస్తున్న కోరికలా చెట్టు.
ఆకాశం అందుకునే ప్రయత్నంలో
రెక్కల్ని ముక్కలు చేసుకుంటున్న చెట్టు.
ఆకారాన్ని విస్తరించే ప్రయత్నంలో
కొమ్మలకు రెమ్మలను పూయిస్తున్న చెట్టు.

సమస్యలను ఛేదించే ప్రయత్నంలో
శాఖలుగా విడిపోతూ
ఆకులను రాల్చుకుంటున్న చెట్టు.

ఈ తోటలో ప్రతిచోటా చెట్టే
చెట్టులా చైతన్యం విస్తరిస్తే
జగమంతా నందనవనం
జవావళికి ఆనంద ఫలం.

## చల్లా రాధాకృష్ణ శర్మ

### అలంకృత మృతదేహం

ఆ మృతదేహాన్ని
అలంకరించారు పూలదండలతో.

అది చూసి
లోలోన గొణుగుకుంది
ఎప్పుడో లేచిపోయిన హంస

అస్థాన పతితమైనందుకు
తలలు వంచాయి పూలదండలు.

మృతదేహానికి సైతం
వాసనలు అంట కట్టడం
దేనికంటూ
మూలిగింది గాలి!

## ఆర్. సీతారామారావు

### గుర్తింపు లేని గోడ

ఎప్పటిలాగానే తెల్లవారుతుంది
చివరి జాముల్లో చంద్రుడు
ఆకాశం కిటికీలు మూసుకుని ఒంటరి గదిలోకి వెళ్ళిపోతాడు.

వీధిని పహరా కాస్తున్న గోడ
కొత్తగా కనిపిస్తుంది.
నిన్నటి కన్నీళ్ళు లేవు, నెత్తుటి మరకల్లేవు
రాత్రి ఒంటరిగా ఉండే గోడకు నేస్తాలు లేరు.
తనముందు దీపస్తంభం
పురుగుల్ని రెండు చేతులాపట్టి తింటూ ఉంటుంది.

గోడకు అడుగు ముందుకు పడదు
మొహంమీద కాలు లేపిన వీధి కుక్క
నిర్లక్ష్యంగా వెళ్ళి పోతుంది
ఎందరి నీడల్నో మెత్తటి గుండెల మీద
వాల్చుకుంటుంది గోడ
అసమర్థుడి జీవ యాత్రకు,
పరిత్యాగి పరివేదనలకు
ఆత్మహత్యలో ముగింపు తీర్మానాలు చేస్తుంది.

సినిమా కాగితాలు కట్టుకుని
కొత్త సినిమా పిల్లకుమల్లే కన్నైగ చేస్తుంది.
గోడకు నోరుంది
నినాదాల్ని పుక్కిలించి ఉమ్మేస్తుంది
నక్సలైట్లే దేశభక్తులంటుంది
తుపాకీ గొట్టాలే విప్లవ రహదారులంటుంది
ప్రజాస్వామ్యం గోడమీద ఊపిరి పోసుకుంటుంది

ప్రభుత్వాలు అసెంబ్లీలు పెడతాయి
మీరుకొనే
స్టెయిన్ లెస్ స్టీలు చెంబాకి
ఉచిత బహుమతి కూపనిస్తుంది గోడ
గోడ తెల్లవార్లూ ఒంటరిదే
మూడో జాములో ఆశయాలు రాసి పోతుంటాడు ఒకడు!
ఆ పై నిమిషంలోనే
పార్టీలు కేటాయించుకుని పోతాయి
అసెంబ్లీ గోడమీద.
అసెంబ్లీ పిల్లి, అయినా భరిస్తుంది.
మీరు పోగొట్టుకున్న జ్ఞాపకాల చిల్లర
తిరిగి అక్కడే దొరుకుతుంది.

గోడ గుండెలమీద గెంతే పసి కందు కాళ్ళని
నిర్దాక్షిణ్యంగా విరిచేస్తుంది గోడ
నిన్నటి సినిమా తెర మీద
కనపడని నర్తకి తొడ
పదికోణాల్లో కనపడవచ్చు.

చూపులు కోల్పోయిన గోడ
అతికించే వాడికి
ఒంటిని సిగ్గులేక అప్పగిస్తుంది.

వాహనాల పలకరింపు
గూర్ఖా కర్ర చప్పుడు స్పర్శ
కానిస్టేబులు కర్తవ్యం
అన్నిటినీ నమోదు చేస్తుంది
క్షణం తీరిక ఉండదు
ఖాళీ దొరికి నపుడు
పిచ్చిగాలి స్తనాలకు
గట్టిగా తగుల్తుంది
గోడకూ్కడా చరిత్ర పేజీల్లో చోటు కావాలి.

## పి. వి. ఎస్. ఆర్. కె. శర్మ

### మంత్రిస్తున్న వేళ్ళు

నాసికాగ్రాన చూపులు ముడివేసినపుడు
నిరంకుశ శబ్ద ప్రహారాలతో
తల వేయి పూరెమ్మల్లా పదాలై వాక్యాలై
ఎగిరి పోతుంది.

నేనొక మకరంద బిందువునై వాటిమీద ఊగుతాను
గాలికి కూడా మత్తెక్కి శత సహస్ర అంగుళులతో
అన్ని హృదయాలను స్పృశిస్తుంది
రాత్రి నక్షత్రాల వేళ్ళతో
నిద్రిస్తున్న కలలను తట్టి లేపుతుంది
వేళ్ళు అనుభూతుల జల్లెడ లవుతున్నాయి
వేళ్ళు లాలిసున్నాయి, పాలిసున్నాయి.

పలకమీద పని వేళ్ళు దుఃఖ సముద్రాలను
అక్షరాల బొక్కెనలతో చేది పోసున్నాయి
అశోకాలు కుంచెలై ఆకాశం మీద
నీటిరంగు చిత్రాలు గీస్తున్నాయి
మబ్బులు చినుకుల వేళ్ళతో
పొలాల, పొదుగులు పితుకుతున్నాయి
అలల వేళ్ళతో సముద్రం
సామ్రాజ్యదాహం తీర్చుకుంటున్నది
కనిపించని మర్రి హస్తపు వేళ్ళు
ఇళ్ళ కింద మళ్ళ కింద ప్రాకుతున్నాయి
అన్ని చోట్లా క్రూర హస్తాలు
మాంసాహారపు చెట్లై ఎదుగుతున్నాయి
ఆకులు రక్తకాంతుల ఉంగరాల వేళ్ళతో
పొంచి ఉన్నాయి
మదుటిని తట్టిన ఆలోచనల వేళ్ళు

మూడోకన్ను తెరుస్తున్నాయి
వేళ్ళు బంధిస్తున్నాయి
వేళ్ళు శాసిస్తున్నాయి
వేళ్ళు మంత్రిస్తున్నాయి
ఎత్తి చూపుతున్న వేలికొసను చేస్తున్నాయి
ముడుచుకుంటున్న వేళ్ళు
తప్పులను లెక్కపెడుతున్నాయి
పిడికిళ్ళు బిగుసుకుంటున్నాయి
ఎత్తిన పిడికిళ్ళు అక్షయ తూణీరాలవుతున్నాయి
చూపుల వేళ్ళతో
పట్టుకున్న గురి చెదరదు
అశ్రువుల వేళ్ళతో పట్టుకున్న
బాణం అదరదు.

## టి. శ్రీరంగస్వామి

### అభ్యుదయం

జనారణ్యాల్లో
చలివేంద్రలు
భావుకుని మనస్సుల్లో కేదార సహృదయ నందన వనాలు
సుసంపన్నతకు
సతత హరిత విప్లవానికి
నిత్యం పోరాటం....
అమలిన శృంగారంలా

# తంగిరాల సుబ్బారావు

## విశాల శిల్పానికి నా కన్నీళ్లు

[26–9–1984 న వాల్తేరులో ఒక జీపు ప్రమాదంలో చిక్కుకొని, విశాఖ పట్టణం కె. జి. ఆసుపత్రిలో చేర్చబడి, 30-9-1984 శివసాయుజ్యం పొందిన నా ప్రాణమిత్రుడు, కవి పండితుడు, సాహిత్య రసికుడు అయిన డా॥ టి. బి. యం. అయ్యవారుగారి దివ్యస్మృతి భారంతో....]

నల్లని నిలువెత్తు రాతి విగ్రహంలో
అప్పుడే తీసిన మెత్తని వెన్నలాంటి మనస్సు;
బాహ్య భయంకర రాక్షసాకృతిలో
అంతర్గతంగా నినదించే
క్రీడావిహారాసక్త సరస్వతీ దేవి
పాద మంజీరాల ఘలంఘలలు;
బృహద్బ్రాండోదరంలో
అణువణువూ జీర్ణించుకోబడిన
అపూర్వ గ్రంథాలయాల
విజ్ఞానాగ్ని శిఖలు;
బండ పెదవుల మధ్య బిగించిన
గణేష్ బీడీ గొంతులోంచి
గుప్పుగుప్పున గుబ్బతిల్లే
రసవత్తర శ్లోకాల పొగలు;
స్విష్టకృత్తుగా చేసే భోజనంతోపాటు
ఈ మూలనుంచి ఆ మూలవరకూ
మూడుసార్లు ఆపోశనం పట్టిన
వ్యాస భారత మహేతిహాసం;
శ్రీనాథుని రసికత్వం
పోతన భక్తి తత్త్వం
డాస్టోవిస్కి నవలా ప్రియత్వం

విశ్వనాథ ప్రత్యక్ష శిష్యత్వం
అన్నిటి కన్నామిన్నగా
మిత్రుల యెడ
శిరీష కుసుమ పేశల స్నిగ్ధత్వం
చెంపకు చారెడు కళ్లల్లో
నిత్యం తొణకిసలాడే
మహనీయ మానవత్వం
ఆంధ్రం సంస్కృతం
ఆంగ్ల కర్ణాటం
నాలుగు దిక్కుల
నాలుగు సాహిత్య సముద్రాల్లో
నిత్యం నీ రసన చేసే
గజస్నానం
నీలో
కవిపండిత -విమర్శకుల
త్రివేణీ సంగమం,

వివిధ సాహిత్య రాసిక్యాల
పుణ్యతీర్థాల సమాగమం
ప్రాచీన శిల్పం వంటి ముఖంలో
మల్లెపూల చిరునవ్వులూ
పట్టుతేనెల పలుకులూ
కలిసిన
చిత్రమైన వెన్నెల వెలుగు,
కంఠంలో
గండు కోయిల పులుగు.
నీతో గోష్ఠి అంటే—
సాహిత్య మహాసాగరపు లోతుల్లో
రాశీభూతమైన నవరత్నాల అనుశీలనం
మహోన్నత కవితా శిఖరాల పరిశీలనం
పద్యమేఘాల్లో దాక్కున్న చమత్కార విద్యుత్తును బ్రక్కడం
రసపరవశత్వపు స్కాచ్ విస్కీ మత్తుతో సొక్కడం....

ఈ పురుష దురంహాకార సమాజంలో
"నాతిచరామి" ప్రతిజ్ఞా భంగాల సంఖ్య
కొందరిలో ఒకట్లు
మరికొందరిలో పదులు
నీలో వందలు....వందలు....
అయినా–
పశ్చాత్తప్త హృదయంతో
పతివ్రతయైన సతీమణి
పాదాలమీద వాలే
పరిశుద్ధాంతః కరణుడైన భర్త
ధర్మపత్ని విశ్వాస పారిజాతాపహరణ కర్త
నీవుతప్ప మరెవడున్నాడు?
మృష్టాన్నంతో శరీరాన్నీ
రాక్షస పఠనంతో బుద్ధినీ
మన్మథ వసంతోత్సవాలతో ఆత్మనీ
మేరు పర్వతంగా
వజ్రాయుధంగా
బృందావనంగా
మార్చిన సంపూర్ణ మానవుడు
నీవు తప్ప మరెవడున్నాడు?
ఆరాధ్య వీరశైవంలో పుట్టి పెరిగి
శ్రీ కృష్ణ మంత్రాన్ని జపించే
శుద్ధ అద్వైతి
నీవు తప్ప మరెవడున్నాడు?

అయ్యో అయ్యవారూ
నీకునిండా యాభైయేళ్లు కూడా నిండ లేదే
మొన్ననే కదా—
ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో
తెలుగు ఎం.ఏ. విద్యార్థులసభలో
ఈ నాటి పెద్ద చదువులు
ఎందుకూ కొరగాని వనీ

అధ్యాపకులు పనికి వచ్చేదేదీ చెప్పరనీ
కుండ బ్రద్దలు కొట్టినట్టు చెప్పావు?
స్వీయ పాండిత్యాన్ని సంపాదించుకోండని
హితవు చెప్పావు?
సంప్రదాయాన్ని కాపాడుకోండని
హెచ్చరించావు?
నిన్ననే కదా—
యస్వీ యశస్వి మెడలో
అందమైన రెండు ఆశుపద్యాల పూల
మాలలు కట్టి వేశావు?
మాతో కలిసి
మండలార్చన చేసి
సఖులతో, పరిహాసకులతో,
ఛలోక్తుల చురకత్తులు తళతళ మెరిపిస్తూ
నవ్వుతూ, నవ్విస్తూ,
కేరింతాలు కొడుతూ
మాటువేసిన చావు కెరటాలమీద
మాతో కలిసి స్వారీ చేశావు?

ఆ రోజు
అర్ధరాత్రి
వాల్తేరు కొండల గుండెల్లో మంట
విశాఖ ఎగుడు దిగుడు రోడ్ల పేగుల్లో ఆకలి
నీ నెత్తుటిలో విరుజ్వరం మూలుగు
అందరం కలిసి
మేనకా హోటల్ వెతుక్కుంటూ
చీకట్లు క్రక్కుతున్న తార్రోడ్డు జెర్రిగొడ్డు నడుంమీద
'ఫుల్లుగా వున్న పోలీసు యముడు'
మత్తు కళ్ల మరణపాశంతో
అదిలించి తోలుతూన్న
జీపుదున్నపోతు కొమ్ములు పట్టుకొని
ఉయ్యాలలాగుతూన్న మా నలుగుర్నీ వదిలి

ఉన్నట్టుండి, అయ్యవారూ
ఎక్కడికి వెళ్ళిపోయావు?
మా భవిష్యదాశల చుక్కల ప్రోవుల్ని
ఒక్కసారి తన్ని వేశావు
మమ్మల్ని చాలా అన్యాయం చేశావు.

నీతో
నాపధ్నాలుగేళ్ల సహవాసం
సీతను కోల్పోవని రామ లక్ష్మణుల వనవాసం
రుజువు చేసింది నాకు
ఏక గర్భ వాసులైన అన్నదమ్ములకన్నా
నీ వంటి ప్రాణ సఖుడు మిన్న అన్న నిజం

తణుకు
నాకు స్వగృహం
నీకు శ్వశుర గృహం
వేసవిసెలవుల్లో ఇద్దరం కలిసి వెడదా మని
పదే పదే అనేవాడివి
అయ్యో అయ్యవారూ
నీ కోరిక నేను తీర్చలేక పోయాను....
కాని–
1984 అక్టోబరు 1 వ తేదీని
నీతో చెప్పకుండా
నే నొక్కడినే వెళ్ళాను మావూరు.
నన్నువదల లేక
నా వెనకాలే
నువ్వూ వచ్చావు ఆ వూరు
శవరూపంలో........
స్వర్గతుల్యమైన గృహంలో
ఒక్క రోజైనా కూడా నిలవకుండా
మట్టిలో మట్టిగా మారి పోయావు.
నా గుండెల్లో

(నా ప్రియమిత్రుడు 'ఉద్యమాల' రంగుల నీలిమేఘశ్యామలుడు)
[illegible]

దింపుకోలేని బరువుగా
మిగిలి పోయావు....
ఓ తాడి కొండ భోగమల్లికార్జున అయ్యవారూ
ఎంతటి మధుర మైత్రిని ప్రసాదించి వెళ్ళిపోయావు గురూ

## "యత్ర నార్యస్తు పూజ్యంతే...."

[గర్భస్థ శిశువు స్త్రీ అని తెలిసి భ్రూణహత్యలకు పాల్పడిన నాగరక సమాజాన్ని గూర్చి 18-10-1985 నాటి *Deccan Herald* దినపత్రికలో వ్రాయబడిన 'Saving the girl child' అనే సంపాదకీయం చదివిన అనుభూతితో....]

మాది వేదభూమి
మా పరమేశ్వరుడు
అర్ధనారీశ్వరుడు
రాముని అనుమానపు పలుకుల ములుకులు
గుండెకు గ్రుచ్చుకొని
నలుగురిలో తలవంచుకొని
సీత చిచ్చులోకి చొచ్చినా—
అతిరథులూ మహారథులూ ఉన్న
నిండు కొలువులో
పాంచాలిని కొప్పుపట్టి ఈడ్చినా
బండ బూతులు తిట్టినా
ఆమె కోకలన్నీ ఊడ్చినా—
ఇక్కడ దేవతలు క్రీడించారు!
మాద్రి నాటినుండీ
సహగమనాలకు ఒప్పుదల ముద్రవేసినా—
వేలాది సౌందర్య రాశుల్ని మందలు మందలుగా
చక్రవర్తుల రాణివాసాల చెఱసాలల్లో బంధించినా—
ఇక్కడ దేవతలు క్రీడించారు!
దేవదాసీల జీవిత కైంకర్య గీతాలను
సొంత జావళీలుగా మార్చినా—

యుద్ధ విజయాలు
యువతుల మానభంగాల కన్నీటి పతాకాలు
ఎగురవేసినా—
రక్షకభట వర్గాలే
రమణీ మణుల ఆత్మగౌరవాన్ని
భక్షించి త్రేన్చినా—
ఇక్కడ దేవతలు క్రీడించారు!
ఇరవైయొకటవ శతాబ్దిలోకి తొంగి చూస్తున్న
శాస్త్ర విజ్ఞాన రక్తబీజుడు
గర్భస్థ పిండాల్లోనే 'ఆది శక్తి'ని గుర్తించి
సంతోషంతో వేసిన గంతు,
ఎనిమిది వేల తల్లుల కడుపుల్లో
మొక్క జీడిగింజల్లా ముడుచుకొని
అమాయకంగా నిద్రపోతున్న
7999 ఆడపిండాల్ని పరికించి
మేధావి రాక్షసుడు
ఇకిలించిన తంతు;
నాగరకత కోరలతో ఆ కర్కోటకుడు
అన్ని పిండాలనూ ఖండ ఖండాలుగాచీల్చివేసి,
సింహనాదం చేసి,
కాకులకూ గ్రద్దలకూ ఎగురవేస్తూ
వీరభద్ర నృత్యం చేస్తూవుంటే—
ఇక్కడ
దేవతలు
ఇంకా క్రీడిస్తూనే వున్నారు!
అక్కడ
స్వర్గంలో మాత్రం
మూర్ఖత్వపు మర్రి కొమ్మలకు
ఉరిపోసుకొని
దీనంగా ఊగుతున్నారు
రాజారామమోహన్‌రాయీ....
కందుకూరి వీరేశలింగం పంతులూ....

## కోట్ల వేంకటేశ్వర రెడ్డి

### అభినవ క్రీస్తు

సూర్యుడింకా
'బెడ్ కాఫీ' తాగనే లేదు!
చంద్రుడింకా
నిశి కౌగిలి వీడనే లేదు!!
ఊరి పొలిమేరన ఎముకల గూడు
ఆగా బేగా నడుస్తోంది
తలకు మాసిన గుడ్డతో-
గుండె మంటను గక్కే పొగచుట్టతో-
అంగ వస్త్రం అసలు లేదు
ఆనవాలుకు మనిషి రూపు
భుజమెక్కిన అరక తీరు
ఏసు మోసిన 'క్రాసు'కు మారు
ఫలం దొరకని రైతు వాడు
నిజం చెబితే క్రీస్తు వీడే.

## సోమసుందర్

### అక్షయాక్రోశం

అక్షయ జీవనానందానికి
అభివందన మర్పిస్తున్నాను
అక్షయాభ్యుదయపరంపరకు
ఆహ్వాన సంకల్ప మందిస్తున్నాను.
నిరంతర శ్రమాఖిన్న
భిన్న విభిన్న హృదయులారా

నా అనుంగు తెనుంగు తమ్ములారా
మీ కోసం జీవన సాగరాన్ని మథించాను,
ఆహ్లాదామృత గీతాన్ని ఆలపిస్తున్నాను.

డెబ్బయి ఆరేళ్ళ క్రితం దయతో ఆగమించి
మన శతాబ్దాన్ని తొలిసారిగా కనికరించి
పలకరించి సెలవు తీసుకొన్న
సంఘ సంస్కరణ పతాక కోసం
ఆకాశ లోకాలన్నీ ఆశగా అన్వేషిస్తున్నాను
ఓ హెయిలే ధూమకేతూ!
హృదయ పూర్వక స్వాగత మందిస్తున్నాను, రా!
మా శతాబ్దంలో నీ ద్వితీయాగమనాన్ని
అద్వితీయ క్రాంత పథంగా మలుచుకో!
కులతత్త్వాల కూటనీతుల్ని
మత తత్త్వాల విషకాలుష్యాల్ని
సర్వంకషంగా కూలద్రోసి పో!

ప్రతిరేయీ నన్ను సేదతేర్చ దయచేసే
మకరందధుని స్వప్నరాశి
సూర్యోదయ శుభకిరణం ప్రసరించకుండానే
విహంగ సమూహంగా దిగంతాల కెగిరిపోతోంది
కలకూజితాల వినిపిస్తోంది లీలగా

యథాపూర్వక మహోద్రేక గర్జాఝంఝులతో
మా వేదికలు నిరంతరం సొమ్మసిల్లుతున్నాయి
కదలడంలేదు, కరచరణాలాడటం లేదు
భయానక కార్పణ్యాలతో కలగి నలిగి
క్రియాశీలతలు అరణ్యవాసం చేస్తున్నాయి
నేటి పురుషకారం
రౌరవాగ్నుల హవిస్సు
జలరుహాల ముఖవర్చస్సు
కిల్బిష పంకిల తమస్సు!

నెగళ్ళు మండించే పగళ్ళు చేబూని
వెదికాను....వెదికాను....
ఏ శీతల ఝంఝుల పెనుదెబ్బలకో తగ్గి
తలలెత్తలేని మానసకేదారాలు
దారిపొడుగునా విషాదధారలు

ప్రతి పుట్టుమచ్చ నేపథ్యంలోనూ
కేన్సర్ల అజ్ఞాత బీభత్సాలే
బెదిరింపుల కడలి హోరులే
దిన దిన గండం వెయ్యేళ్ళాయుష్షుగా
దొరికిన ప్రతి నా దారినీ శ్రీరామరక్షగా
భ్రమావలయాల మృషాకవచాలల్లుకుంటున్నాను.

జనపదాల పేటలలో
ఇరుకుయిరుకు సందులలో
వెదురు బేడాలవంటి సంకీర్ణతలు
వెదుకుతూ వెదుకుతూ
బయట పడదామనుకుంటూంటే
సందుమొగల బయళ్ళనిండా
తల విరబోసుకొన్న చీకట్ల కోలాహలమే!

నా జాతి రూపొందించిన సోదర కవులంతా
పీడిత జనానీకసహస్రాల
సంక్షుభిత హృదయాలను కాక
గ్రంథాలనో నిఘంటువులనో
శోధిస్తున్న మేధావులు
సజీవ కవితకు ప్రేరణ–జీవన యథార్థం కాదేమోనని
కొత్తగా సంశయిస్తున్నా రిటీవల
ముడి సరుకుల వంటి ఉక్తివైభవాల
రిక్త వచనాలను కవితలుగా చెలామణీ చేస్తున్నారు
ఐనా భయంలేదు, నేనున్నాను మీకోసం
అహరహతపోధ్యాన నీరతుడనై మీకోసం
ఎంత దీర్ఘమైనదో నా దారి?

నీడవిశ్రాంతంగా సాగుతున్న బాటసారి
ఎన్నో కష్ట నిష్ఠుర బాధల సహచారి
ఆకస్మిక భయోత్పాతంగా నాదారిలో
అఖాతా లెదురవుతాయేమో తెలియదు.
సుమతలాలే దయతలచి పాదాలను లాలిస్తాయో
కంటక భరిత భూధరాలే సాక్షాత్కరించి
వికటాట్టహాసం చేస్తాయేమో తెలియదు.
ఈ పర్వతా లధఃకరించాలంటే
పస చెడని కాళ్ళొక్కటే చాలదు,
బలోపేత బాహువులూ, పట్టుతప్పని వ్రేళ్ళూ
ఎంత అవసరమో నేనింకా గ్రహించలేదు
నా దారి కెలకుల తల లెత్తుక
ఠీవిగా నిలచిన వెల్లవేసిన రంగురాళ్ళు
కేవల దూరగణన సంకేతాలే తప్ప
అవే చరమగమ్యాలు కావని తెలిసే
ఎరుక ఎప్పటికీ అవగతం కాదు

అదుగో అటు చూడు
పేదల కోసం నిర్మిస్తున్న గృహాలు
పిచ్చి తుప్పల్లా వికారంగా పెరిగిపోతూ
బ్లూ ప్రింట్లను విచ్ఛేదిస్తున్నాయి
పల్లెటూళ్ల పురాతన నయనాలలో
నవధనిక స్వాముల మోటారు కార్లు
అనారోగ్యకరంగా దుమ్మూధూళీ వెదజల్లుతూ
శరవేగంతో దూసుకుపోతున్నాయి.

తండ్రులూ తాతలూ పెంచిన
ఫలారామాల సుందరద్రుమాలు
గొడ్డలివ్రేటులకు నిష్కర్షగా గురియై
అల్లి బిల్లిగా పెరిగిన దూరారణ్యాలకు
దీనంగా వలసపోయాయి దిక్కులేక
అరకొరగా మిగిలిన ఏకాకిపాదపాలు

బిక్కు బిక్కుమంటూ చూస్తున్నాయి
అలవాటుగా పాపం ఆమనికి
కొత్త చిగుళ్ళెత్తుతున్నాయి కాని
అని నవాశయపల్లవాంకురాలేవని
ఎలానమ్మమంటావు? ఎలా తృప్తిపడమంటావు?
కొండల్ని ఆశ్రయించి తలదాచుకుంటున్న
ముళ్ళతుప్పల్నీ అడవిచెట్లనీ
నగరాల ఇటిక కొంపలు మింగేస్తున్నాయి
మోడుకొమ్మల కోపానికి భయపడిన నల్లమబ్బులు
సదా జాగరణల సాగరతరంగాల
శరణు పొందుతున్నాయి
ఇంకేమాగమిస్తాయి వర్షాలు?
నవతరుణీహాసోత్సవ హర్షాలు?
తెలుగునేల నాలుగు చెరగులా
గ్రామవాసుల శూన్యహస్తాలే మిగిలాయి
విశుష్కవదనాలే దర్శన మిస్తున్నాయి
ఓహో అనుంగు తెనుంగు తమ్ములారా
అకళంక శీలవతులారా, ఆడపడుచులారా
ఈ ఆమని వేకువలో క్రమ్మిన పొగమంచు తెరలకు
అర్థమేమిటో యోచించండి

నిజమే—ఇది నేటి
యథార్థ స్వరూపాని కొకక పెద్ద
సర్వస్వంయిదేకాదని నేనూ అంగీకరిస్తాను.
నిరాశ చెందకండి, ఈ ఉగాది శుభవేళ
మనకేం అదృష్టవంతులం
గోదావరీ కృష్ణవేణీ పెన్నా తుంగభద్రా
నదీమతల్లుల ఒడిలో గారాల
కూనిరాగాలు తీసే పసిడి మొలకలం

మనం నిలుచున్న ఈ రేవుకే
కొత్త కెరటాలు పోటెత్తుతున్నాయి గమనించండి
లంగరెత్తండి కొత్త పడవల నందగించండి, నేడే

ప్రతి నదీముఖ ద్వారంలోనూ
నవోత్సాహ తోరణాలు కట్టండి
పురోగతి పటంపై
కొత్త అంకెల అరుణ రేఖల నలంకరించండి....

## పేర్వారం జగన్నాథం

### మహా మానవుడు

అనాది మానవుణ్ణి నేను
అనంతం వైపు సాగుతున్నవాణ్ణి
అభవుణ్ణి– అజేయుణ్ణి
అమరుణ్ణి– అభేద్యుణ్ణి
చిరంజీవిని– చిరస్మరణీయుణ్ణి
ఇంతకూ నేనొక
సామాన్య మానవుణ్ణి

మానవతను గుండెకు వ్రేలాడదీసి
అనురాగాన్ని ఒళ్లంతా పూసుకొని
సూర్య బింబాన్ని నాకిరీటానికి
తురాయిలా చెక్కుకొని
దివాంధాల కనుకొలకుల్లో
సూర్యగోళాలు మొలిపించి
నాజాతి చైతన్యానికి
వసంతాన్ని సంకేతంగా చేసుకొని
నా ప్రజల రక్తనాళాల్లో
అణు విద్యుత్తు ప్రసరింపజేసి

నావాళ్ల కందరికీ బుద్ధదేవుని
కరుణారసం తాపించి
నా జాతి జనుల నొసట
గాంధీ మహాత్ముని అడుగులు ముద్రించి
అంతఃపురాల అవరోధాలు తెంచి
అల్లకల్లోలాల సుడిగుండాలు దాటి
రెచ్చిపోయిన రేసుకుక్కల
మూతికి ముకుదాడు బిగించి
ఎత్తు పల్లాల్ని ఏకం చేస్తూ
ముళ్లకంపల్ని పూల పల్లకిలా మారుస్తూ
మీకోసం అవతరించినవాణ్ణి
మీపై ప్రమాణం చేసి చెబుతున్నాను
మీతోటివాణ్ణి— మీతోబుట్టువును

మనిషి మనుగడకోసం
మనిషి భవితవ్యంకోసం
అవిశ్రాంతంగా ఆరాటపడే
అడ్రసు లేని మానవుణ్ణి
నేను చిరంజీవిని
నేను చిరంతన సంజీవిని
నా పేరు మానవుడు
విప్లవం నా అసలు పేరు.

## ఎ. ఎన్. నాగేశ్వరరావు

### రాళ్లసీమలో ఆకలి చావు

ఆకాశం నెర్రెలు చీరినట్లుగా
జీవితం పగలుతున్న సంధి స్థితి ఇది—
నేల విరిగినట్లుగా
చావు జీవిస్తున్న నిరామయ కాలం ఇది—

ఆకసితో చచ్చినా
కట్నపు గ్యాసు వాసనలో తగులబడినా
ఎన్‌కౌంటర్‌లో హత్యించినా
పెనుగులాటను నేను పోరాటంగానే వర్ణిస్తాను—
ఊపిరి పీల్చిన ప్రతి సెకనూ
చచ్చి బతుకుతున్న కాలం ఇది-
ఒయాసిస్సులో దాహం జలగ బలుస్తోంది
ఆకలి తుఫాను జీవితం వెలియలి కట్ట నెపుడో దాటేసింది
ఇక ఆకటి బావుల ప్రేమ పరిష్వగంలో విదురిద్దాం
రాజ్యాంగపు సుమప్తిలో
ఆత్మహత్యా ప్రకరణాల దాపున
ప్రాథమిక హక్కుల సుడిగుండాల్లో
ఆకటికేకల వీమల ధ్వని వినపడదు.
ఎడారిలో దోసెడు నీళ్లింకినట్లుగా
ఆకటి బావుల 'స్ఫూర్తి' మా ఎడారి సీమలో యింకిపోతాయి
ఆ మరణధ్వని
భారీ సంస్కరణల ఉపన్యాసాల ఆవేశాల అరుపుల్లో....
కనబడదూ వినబడదూ
వినపడినా కనపడదు.

## వరగు కృష్ణమూర్తి

### రాబోవు శతాబ్దము

మహాస్వప్న వాతాయన మంజుకిరణ మార్గాగత
మయూఖాల మనములలో
శతాబ్దాల సంభ్రమ విశ్శబ్ద చరణ చలనములో
కోటి కోటి విచారాలు పోటీపడు క్షణములలో
చూచినాను చూచినాను మహాస్వప్న సౌందర్యం
మానవత్వ మకరందం.

యుగము సూర్యచంద్రులుగా యుగము సప్తతారలుగా
నేను మరియు నా దేశము నిరంతరము వెలగాలని
ఆకాశము పొలములలో రాకాప్రభలను మించెడి
ప్రగతి బీజ నక్షత్రాల్ పండించే తీరాలని
నా దేశము ఇంటిముందు నక్షత్ర కవిత కాంతులు
ముగ్గులుగా నిగ్గులుగా పూత వేసుకోవాలని
దేవేంద్రుని వనమునుండి దేవేరికినై తెచ్చిన
పారిజాత పుష్పాలను ప్రతి వనితకు పంచాలని
ఆరిన ప్రతి దీపానికి అంగారము పంచాలని
చీలిన ప్రతి హృదయములో శృంగారము నింపాలని
ఇంకిన ప్రతి కంటిలోన ఇలాతలము ఉండుదాక
ప్రవహించే గంగమ్మల ప్రపూరములు దింపాలని

ఎన్నాళ్ళుగ చూస్తున్నా
వేనవేల శతాబ్దాల వీథులలో బాటలలో
విజిల్ ఒకటి వేస్తున్నా
విసరి విసరి వేస్తున్నా మహాస్వప్న విహంగాలు—
నా దేశము పూవులలో నడకలు సాగించాలని
స్వప్నమొకటి చూస్తున్నా.—

నా దేశపు ప్రతిమనిషీ నభోజేత కావాలని
భీమునిగా మారాలని భీష్మునిగా బ్రతకాలని
నా దేశము గోవులన్ని కామధేను మాతలుగా కావాలని
శాంతి శుభనదీనదాలు జ్ఞానహృద్ధిమ నగమునుండి
మానవత్వ దిశకు మహాగానముతో సాగాలని

నా దేశపు మువ్వన్నెల సౌదామిని పతాకాలు
చంద్రుని చుంబించి, సూర్య సఖుని కౌగిలించి మించి
మంగళ గ్రహమ్ము మీద మధురగీత మాలపించి
రంభలను వరించాలని
మధుర మధుర స్వప్నావళి
ఎన్నాళ్ళుగ చూస్తున్నా
శతాబ్దాల శిరసులపై సరాసరిగ నడుస్తున్నాము

నేనూ నా దేశ ప్రజలు నింగిలో నడుస్తున్నామ్
పోతున్నది మా నౌక
సూర్యుని ముఖాముఖిగా చుక్కల వనవారిధిలో
కదిలే మారుతుల వోలె
విజ్ఞానము ముఖాముఖిగ నేనూ నా దేశ ప్రజలు
వియద్వీథి నౌకలుగా వెడుతున్నామ్ వెళుతున్నామ్
పుడమితల్లి విజయానికి పునాదులను వేస్తున్నామ్
నా దేశము గుడిగంటలు ఆదేశములిస్తుంటే
భూస్వాములు నియంతలును
విరాధులుగ నింగినుండి ధరపై పడిపోతున్నారు
నా కంఠము త్రిలోకాల నారాయణ మంత్రముగా
నా మంత్రము నందీశ్వర నాందీస్వర తంత్రముగా
లేస్తున్నది స్వర్గ పథము తీస్తున్నది
నా దేశము ధర్మరథము నడునింగిని పోతుంటే
స్వాగతమంటున్నవి శత సంజీవని పర్వతాలు
నా దేశము కర్మరథము నడు జలధిని పోతుంటే
శిరసులపై జల కన్యలు ఉరసులపై రత్నాలను
జల్లులుగా కురిపిస్తూ జయము పాడుతున్నారు
రాబోయే శతాబ్దమ్ము రమ్మని పిలుస్తున్నది
ఇరవై ఒకటవ శతిలో స్థిరమై పోతున్నాను
వరమై పోతున్నాను
నేను మరియు నా దేశము నింగిలోన పోతున్నామ్
రాబోయే శతిమాకై రంగవల్లి వేస్తున్నది
నా దేశము పేరు పూలు గంధముతో వ్రాస్తున్నది
నా దేశము పేరు నభము మించులతో వ్రాస్తున్నది.
ఇప్పుడు నాపాటనుండి ఇదో మహావాల మొకటి
లేస్తున్నది అగ్నిధ్వని చేస్తున్నది లేస్తున్నది
వైకుంఠము పాతాళమువరకు పెరిగి పోతున్నది
మా అందరి గమనానికి మహాధ్వాల సేతువుగా
లేస్తున్నది రహస్యాల రాస్తాలను తీస్తున్నది
నా దేశము పేరు నింగి తారలతో వ్రాస్తున్నది
నా దేశము పేరు అగ్ని జ్వాలలతో వ్రాస్తున్నది

గ్రహ గ్రహాల నందనాలు చందనాలు పూస్తున్నది
నా దేశము ఆదేశము నక్షత్రాల్ మోస్తున్నవి
నా దేశము పేరు గాలి గంధముతో వ్రాస్తున్నది
నా దేశము పేరు భూమి పూవులతో వ్రాస్తున్నది.

## కీ. శే. దేవరకొండ బాలగంగాధర తిలక్

### త్రిమూర్తులు

(ఇది తిలక్‌గారి ప్రసిద్ధ కవిత. 1968లో విశాలాంధ్రవారు ప్రచురించిన 'అమృతం కురిసిన రాత్రి'లో దీని చిత్తుప్రతి మాత్రమే ఉంది. ఇంప్రూవ్డ్ ఫెయిర్ కాపీని తిలక్‌గారు ఆంధ్రప్రభలో ప్రచురించారు. దీనిని విశాలాంధ్ర వారు తీసుకోలేదు. విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీలలో ఉండే సుగుణాలు, దుర్గుణాలు రెండూ ధ్వని గర్భితంగా చెప్పారు తిలక్— తంగిరాల)

ఒకడు
మావాడే
మహాగట్టివాడు
మకుటంలేని మహారాజయ్యే వాడు
కానీ
ముసలిదాన్ని
మూల కూర్చున్నదాన్ని
మసక మసక కన్నులదాన్ని
మనుధర్మ శాస్త్రప్పందిరిలో
మనువాడాలన్న తొందరలో
మంచీ చెడ్డా మరిచి పోయాడు
మర్యాద లతిక్రమించాడు
మరి పనికి రాడు.

మరొకడు
మల్లె పూలమీద పరుంటాడు
మంచిగంధం రాసుకుంటాడు
మరి ఎందుకేడుస్తాడు?
మంచివాడు
మాకు నచ్చిన వాడు
మంత్ర నగరానికి వెళ్ళొచ్చినవాడు
మధ్య మధ్య మాధ్వరసం చేదంటాడు
వధ్య శిలమీద విరహగీతం రాస్తాడు
మాతోపాటు నడుస్తానంటాడు
మరి నిజంగా వస్తాడా?
మారి పోయిన జగాన్ని చూస్తాడా?

మూడోవాడు
అరె! వీడు చిచ్చర పిడుగు
ముందుకు వేసిన అడుగు
ఎండలో నడిచే మనుషులకి గొడుగు
మాకు చిన్నన్న! కానీ అన్నన్న!
(మరి చెవులో చెపుతాను వినండి)
యీ మధ్య విజాతీయ మద్య
పానీయాల సేవనా విద్యా
సద్యః ప్రాప్త భావ శూన్యుడై
మత్తుగా పరుండి నిద్రపోయాడు
మరి యిప్పట్లో లేవడు.

"(ఈ ముప్వురూ తెలుగు సాహిత్య లోకానికి చెందినవారు— వీరెవరో చెప్పుకోండి)"

# ఆర్వీయస్. సుందరం

## కోఽహం

కాలాన్ని గుండియ స్పందనతో కొలిచే
నరుడికి నారాయణుడి కున్నన్ని నామాలు
ఇంతకీ నేనెవర్నంటావు నేస్తం?

కాలేజీలో చదివే రోజుల్లో
సంధ్యాకమలంలో తుమ్మెదలా
గురూపదేశాల మధ్య చిక్కుకొని
మథన పడి, విల విలలాడి
చుట్టూ కట్టుకొన్న ఆలోచనల సాలెగూళ్ళను
దాటిరాలేక
వేంకటేశ్వర శతకాలు రాసుకుంటూ
భక్తి మత్తులో జోగుతున్న రోజుల్లో
నా పేరు దేవదాసు.

కంచంలో అన్నంలాగా లంచాలు మేసే అన్నలు
మంచితనం గుండెలమీద పొడిచి
వినోదించే కాకాసురులు
పులి కోరల్లో చిక్కిన లేడిగొంతుక కోసం
కెమెరా సిద్ధం చేసుకునే వినోద ప్రియులు
చీమను చంపలేని మనిషికి
ముద్దుగా పెట్టిన పేరు ఉగ్రవాది.

కదలిక, కరుణ, కన్నీళ్ళు—
మమత, మానవత్వం ఉన్నవాణ్ణి గౌరవించి
రాళ్ళు రప్పలు, చెట్లు చేమలు
దేవుడన్న మూడక్షరాలు
మూల చైతన్యానికి సంకేతాలు కావనే
బోధిసత్త్వుని ప్రబుద్ధ చింతనకు

విలువిచ్చే మనిషికి
మేధను హవిస్సుగా అర్పించిన యజమానులు
ద్వేషంతో పెట్టిన పేరు నాస్తికుడు.
పేగులు పెరుక్కు తినే ఆకలి రాక్షసుడి నోట్లో
తిండిగింజలు పడెయ్యడం కోసం
కండల్ని కరిగించే కష్ట జీవుల కలల్తో సహా
బాపగా చుట్టి పరుగెత్తుకెళ్ళే హిరణ్యాక్షులకు
వరా లివ్వకూడదన్న నేరానికి
తిట్టు కవిత్వానికి పేరు పడ్డ పెద్దలు
పెట్టిన పేరు సామ్యవాది.

ఇంతకీ నేనెవర్నంటావు నేస్తం?

ద్వైతాన్ని పొట్టలో దాచుకొన్న అద్వైతిని కాదు
ఆస్తికోసం అలమటించే ఆస్తికుణ్ణీ కాదు
విభక్తి లేని పదాలు పాడుకొనే భక్తుణ్ణి కాదు
పొగలేనిదే ఆలోచన రాని అగ్ని హోత్రివి కాదు
సురలేనిదే నిద్రపట్టని భూసురుణ్ణి కాదు
ద్యూతాసక్త రాత్రించరుణ్ణీ ధర్మరాజునూ కానే కాదు.

స్నేహాన్నీ పుస్తకాలనూ
కదిలే జీవాల్ని చూచి వాలుగు కన్నీళ్ళు రాల్చ గలిగిన
మనసులనూ
రేపటికోసం
మంచి ఆలోచనల్ని కూడ బెడుతున్న
మనుషులనూ—
ప్రేమించే నన్ను ఇంకా ఏ ఏ పేర్లతో
పిలుస్తావు నేస్తం?
ఇంతకీ నేనెవర్నంటావు—
కోఽహం.

## సంధ్యాగీతం

ఈ మసక చీకట్లో
మనిషి ముఖం కప్పుకొని
తలకిందులుగా నడిచి వెళ్తున్న
ఆకారాల్ని చూస్తుంటే భయమేస్తోంది.

కాళ్ళను భూమిలోకి పాతి పెట్టుకొన్న చెట్టు
ఈ క్షణమో మరుక్షణమో అంటున్న
ముసలి సూర్యుణ్ణి చూచి
తల ఊపుతోంది.

తల విరబోసుకున్న నిశాతరుణి
సంజ కెంజాయల్ని చెరగుతో మూసి పెడ్తున్న వేళ
రేపటి సూర్యోదయం కోసం
రాత్రిని భరించాలనే నిశ్చయం
పడిపోతున్న మానస స్తంభాన్ని నిలబెడ్తోంది

## నిన్న-నేడు-రేపు

నిన్న వేరు, నేడు వేరు, రేపు వేరు
అంతా ఒకటనుకోడానికి కారణం
లోచూపు లేక పోవడమే.

వేరు వేరని చెప్పడం భేదం చూపడానికి కాదు
ఒకే విధంగా కనిపించే వన్నీ
ఒకటి కాదని తెలుసుకోడానికే.

నిన్నటి పాత్ర ఖాళీ చేస్తేగాని
నేటి రంగుల్ని భర్తీ చెయ్యలేం
నేటి రంగుల్ని తుడిచి వేస్తేగాని
రేపటి కలలకు స్థానం చూపలేం-
ఖాళీ చేసే చేవ ఉన్నవాడే
భర్తీ చేసుకోగల శక్తి కలవాడు.

శక్తి లేని వాడు ఏ చిత్రాన్నీ చూడలేడు
తన చిత్రాన్నేం ఆవిష్కరించుకుంటాడు?
చిత్రాన్నే ఆవిష్కరించుకోలేని వాడు
ఆత్మను దర్శించుకోగలడనుకోడం భ్రమ.
నిన్న వేరు, నేడు వేరు, రేపు వేరు—
నిన్ననీ నేటినీ ప్రతిమా గృహంలో నిలబెట్టి
రేపటికోసం ఆలోచిస్తేనే
మనిషికి మనుగడ.

## శ్రీనాథ్

### వేళ్లు

కొమ్మమీద పండై
ఆకుల బాధ నాలో పొంగించి
కొమ్మ బరువు దాచుకొని
పుష్ప స్మరణలో ఫలమై
కొమ్మ విడిచి విత్తులు వేరూనకుంటే
పచ్చికాయ బ్రతుకే కదా
చివరికి మిగిలేది!

### 'కాలడి' రోడ్డు

మా చిన్న పిల్లకి చెపుతాను హోం వర్కులో—
'సున్న ప్లస్ సున్న ఈజ్ ఈక్వల్‌టు సున్న
అని నువ్వు గ్రహించినప్పుడు
కాలడి రోడ్డు మీద ఉంటావు'.
నువ్వు శూన్యమని నిరూపించడానికి ఎంత వేదన!
ఎంత బ్రహ్మానందం!

జయస్తంభానికి
'పూర్ణ' మీది వంతెనకీ మధ్య
శంకరునికీ ఆచార్యునికీ మధ్య
ఆ నది ప్రవహించింది ప్రవహించింది
ఒక సముద్ర గర్వంతో
ఆఖరి మునకను లక్ష్యం చేయకుండా
నీళ్ళు తిరిగి నీళ్ళవడానికి.
(1981 నవంబరులో 'కాలడి'ని సందర్శించినప్పుడు వ్రాసింది)

## ఏ. శ్రావణ్‌కుమార్

### నేటి భారతం

ఆకలి పోరాటాలు
అణుయుద్ధ భయాల మధ్య
దిక్కు తోచక ఎగురుతోన్న
'శాంతి కపోతం'!

### హృదయం అద్దమవి!

ఏదీ!
నీ హృదయం అద్దమైతే—
అందులో
నీ మనోభావాలు చూపు—
అవే నిజాలైతే....
ఈ ప్రపంచాన్నే ఊపు!

— O —

## మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

### కన్యాకుమారిలో అరుణోదయము

ప్రాఁత చీకటి బావిలో లోఁతునఁ బడి
దిక్కు తెలియక మూల్గు నాదెసకు నొక్క
సమణి కంకణ పాణి పద్మమటు సాఁగి
వచ్చెఁ గన్యాకుమారి ప్రాగ్ద్వార సీమ.

రుచిరుచిర దీప్తుల నుషస్సరోజ నయన
కాళ్లఁ బారాణి శోణ రేఖలను దిద్ది
సాగర శ్యామ సీమాంత భాగములను
దడవి కొనివచ్చె నరుణ మంత్ర స్వరమ్ము.

సప్తాశ్వములకుఁ బ్రస్థానావసర వేళ
రంగైన కుచ్చు తురాయి తీర్చి
వెలువారు దాసాన చెట్ల కొమ్మల రెమ్మ
లం దెల్లవిరుల కన్విందుఁ గూర్చి
పద్మరాగ మణిప్రభాజనిస్థానమౌ
రోహణాద్రికిఁ బేశలోహలిచ్చి
తామ్రపర్ణీ సైకతములందు మెఱసెడి
కొసముత్తెముల రంగు పసలు తెచ్చి
నా యొకని కోసమట్లు ప్రాణ స్పృశమ్ము
తలఁపుగా సన్న సన్న మేల్కొలుపుగాఁగఁ
గడలి కూడలి ఘోష మాగధుల గీతి
వాదమై ప్రొద్దు పొడిచెఁ గన్యాకుమారి.

అళికుల రావముల్ శ్రుతుల కాదట గొల్పఁగ నారికేళతై
ల లవము పూఁతస్నాన సవిలాస సమార్ద్రములౌ నరాళ కే
రళ మహిళా సుదీర్ఘ చికురంబుల చిక్కెడలించు దువ్వెనల్
కలిత నవోషసంబులగు కాంతి కరంబులు సోఁకి నవ్వెడిన్.

కడలి గర్భమునుండి బడబాగ్ని సుందరి
తల యెత్తెనో జగద్దర్శ నేచ్ఛ!
మంగళస్నాత శ్రీ మాతృక చుట్టు చెం
గావి చీరలు నారఁ గట్టఁబడెనా!
మథన వేళోద్భూత మహితామరద్రుమ
శాఖా కిసాల శేషముల రుచులో!
బాల సూర్యోదయ పాకౌషధపుఁ జికి
త్సకుఁడు పేర్చిన యింగిలికపు శిలలో!
ప్రాగ్దిశాభిత్తికా చిత్రరచన సేఁతఁ
జేర్చిన హొంరంగు రంగు కుంచియలో యేమొ!
క్రమము తప్పి క్షణక్షణ భ్రమలు గొలిపి
తెలిసె నపవాద విధినిఁ బాటలి మరోచి.

కోయిలల కన్నులును మావి క్రొంజిగుళ్లు
కడలి కెరటాలలోఁ గుహూగళరవంబు
లాకళింతకుఁదెచ్చెఁ గన్యాకుమారి
యాట తోట ననార్తవంబైన మధువు.

అమృత మహస్స హైందవ మహాంబుధినుండి 'అరేబియా' సము
ద్రమునను బంగళా జలధిఁ దార్కొని తాఁ ద్రిగుణాత్మికమ్ము పే
రిమి భువనంబునం దవతరించిన కుంకుమప్రొద్దు పూర్వ పూ
ర్వములకు నన్ను లాఁగికొని వచ్చె వినిద్రిత జీవభావమై.

శ్రీ వివేకానంద శిలమీఁదఁ దొలి చూపు
మలి చూపు శ్రీపాద మంటపమున
పరమేశ్వరీ పదాబ్జమ్మునఁ గుడికేలు
నెడకేలు రవళించు కడలి మీఁద
మందేహ దైతేయ మదముపై నొకకాలు
నొకకాలు చీఁకటి యొఱకటమున
దక్షిణ భారతీయక్షోణి నొకవెల్గు
నొకవెల్గు హైందవంబుత్తరమునఁ
బఱచుకొనె నన్నదియు ద్వైత పరిచయంబ

కాని యుగ పన్మహెూదయక్రాంతి భాస
మాన మా ప్రొద్దులో నభిధ్యాన వీథి
గణ్య కన్యాకుమారి కారుణ్య మొకఁడ.

నయనము కోటికోటి జననంబులుగా నిటు రాగవాసనన్
బ్రియపడి నమ్ముకొన్న ఫలమేయిది! కాయమునంటియున్న యిం
ద్రియమున కెంత శక్తియొ! యతీతము రూపముగాని రూప, మ
వ్యయము శివమ్ము సుందరము నౌ తనుఁదాఁగనుటెంత రక్తియో!

చెమరుచు కన్నులై వడఁకు చేఁగవ మోడ్పులునై జపాభిశో
ణిమ మది నెమ్మదిన్‌గొన నణీయముగా వినవచ్చె సర్వ వి
శ్వము 'తమేవ భాంత మనుభాతి' యటన్న శ్రుతి ప్రతిధ్వనుల్
ద్యుమణి శశాంక వహ్ని తటిదుజ్జ్వలతల్ తనలో మిడుంగుఱుల్.

విరహ విచ్ఛేదములు రాని వెలుఁగు—దుఃఖ
దురితములు లేని వెలుఁగు—బంధూక పుష్ప
బంధువై బోధవాణి విన్పట్టు వెలుఁగు
నాఁటి యరుణోదయమ్ము కన్యాకుమారి.

త్రిగుణ సంగమ మీ మహెూబ్ధిఁ బడి సాఁగు
జీవ నౌకల కమవస చీకటులను
దారిఁజూపు దీపస్తంభ దర్శనముగ
వరలుఁ గౌమారి నాసాగ్ర వజ్రరోచి

# ముదివర్తి కొండమాచార్యులు

## తెల్లవారలేదు

కయ్య దిబ్బలందు కాల్వగట్టుల యందు
తోటలందు పెరటి దొడ్లయందు
కాపురమ్ము సలుపు కష్టజీవులకింక
తెల్లవారలేదు – కల్లగాదు.

తొలుకోడి కూత తోడనె
కలయంపిజల్లి ముగ్గు గట్టిలనిడి యిం
టిల పాది నిద్ర లేపెడి
కలకంఠికి దాస్యముక్తి కలదో లేదో?

బారెడు ప్రొద్దగు వరకున్
కారుకొనిన యంట్లుతోమి కడిగెడు పనిలో
నోరు కడిగికొన బొత్తిగ
తీరికయే లేని లేమ తినుటెప్పటికో?

తినుట కేముండు? తారి దప్పినవి రెండు
మెదుకులో మాడుఁ జెక్కలో మిగులు సగులు
పులుసు చారులో గాక బుభుక్ష దీఱ
వెలఁది కిడుటకు గేస్తులు వెఱ్ఱివారె?

దిస మొలలతోడ నిసుఁగులు
మసిపాతలతోడ తాను మనలో నొకరై
మసలుట నిత్యము గనుచున్
ససేమిరా సంఘమునకు జాలి గలుగదే?

వేరు వెల్లంకులుంగాక వేకటికిని
వేకికిని మందు లెఱుఁగరు–వెంకి వలపు
పాటలకు నేకరుటగాదు పడఁతి కష్ట
పాటుగని మేలు దలచుట పాడి మనకు.

ఒక్క సంక్రాంతి శుభవేళ దక్క బిచ్చ
మడుగ నొల్లదు పరుల నీ బడుగు జాతి
కాయిక శ్రమ మనపాలు; కడుపు మాత్ర
మాకు లలముల పాల్సే(త అఘము మనకు.

## తుమ్మపూడి కోటీశ్వరరావు

### నాదపింఛము

బుడగలు తేరుచున్నయవి ముగ్ధమనోజ్ఞముగా వియన్మహా
జడధి జలాగ్ర భాగమున, సన్నని ముత్తెపు బిందుకోసలై
అడుగున ఏలసన్మధుమహాకృతి పిల్లన గ్రోవి క్రోల్చు స
వ్వడుల తరంగ మాలికలు వర్తులమై భ్రమియించుచున్నవో.

నీలి కల్వలు–ఇంద్రపు నీలమణులు
గగన ఖండముల్-ప్రబ్బలి గంట్ల పూలు
మోహన తనూలతలు–శిరో ముగ్ధరుహము
గమన కింకిణి-చిత్రలేఖనము రేఖ
కడిమి మొగ్గలు–శృంగార కలిత లలిత
లోచనాంచల చలన వల్గువు జగత్తు
నాద మాధురీ భ్రమణ సంతాన భవము.

ఒగి, సుకుమార సౌరభములూగిసలాడుచు వచ్చిన
ట్లుగ నునుక్రోవి సద్దు కరడుల్ కరడుల్ గొని సాగి బండి చ
క్రగతిగ బర్హి బర్హముల కాంతులు వృత్తము లాడి మన్మనో
జగతి కథః ప్రదేశముల సాగెను నాదము వర్ణపింఛమై.

పింఛములు చక్రమై మనోవేగమంది
హృదయ కుహరాంత రాంత రోర్వీ స్థలాన
నీరవాంభోధి నైల్యకాంతి ప్రముగ్ధ
నిశ్చలావర్తమట్లు కన్పించుచుండె.

సవ్వడులనుండి శబల పింఛమ్ములురలి
పింఛములనుండి వర్ణముల్ ప్రిదులు చుండె
వర్ణమయమైన గుహయెల్ల భావమయము
భావపు చివళ్ళ శిశునటావర్తనములు.

గుహగుహ యెల్ల నెమ్మిపురి క్రోల్చిన వన్నెల ఇంద్రచాపముల్
ప్రహరి చరించు తన్మణి శలాకల కాంతి చిగుళ్ళనుండి గో
మహతి కదంబముల్ ప్రభవమంది గవాంపతి యెవ్వడో తథా
స్పృహబడి తోకలెత్తుకొని చెందెగవీతమసాంధ గర్భముల్.

ఈ చతుష్పాత్తు గోవు ఏకైక పాద
యగుచు నా వెల్గులో లీనమై చనంగ
ఆ మహారాశి సుడిలోన అణగిపోతి
నేను నేనన్న భావన కానరాక.

## కీ. శే. టి. బి. యం. అయ్యవారు

### మాధుర్యదీపిక

[ఆచార్య యస్వీ. జోగారావుగారు జాతీయాచార్యులైన సందర్భంగా, వాల్తేరులో ఏదో పనిమీద కలుసుకున్న వివిధ విశ్వవిద్యాలయాల అధ్యాపకులు వారింట్లో అభినందించటానికి సమావేశమయ్యారు (26-9-1984). అప్పుడు ఆచార్య టి. బి. యం. అయ్యవారు ఆశువుగా చెప్పిన పద్యాలు]

స్నేహ పీయూష పాథోధి, శిష్యబృంద
వనవసంతుండు, సాహితీ వల్లభుండు
బ్రహ్మనిష్ఠుండు, శ్రీ జోగరాయ గురున
కాయురారోగ్య సంపద లమరుగాక.

ఒక శ్రీనాథుడు తిక్కయజ్వయు మహేంద్రోర్వీరసాంభోనిధుల్
సుకవీశాన భవన్మనోహరతనుస్ఫూర్తిన్ భజింపన్ సమ
స్తకళా కాంతుడవీవు నీకిదె ఉదంచత్ స్నేహ మాధుర్యదీ
పిక కైకోగదె దీని మేమిడ కృపా వీక్షాభిరామంబుగన్.

# టి. వి. కె. సోమయాజులు

## కరివే(పాకు

ఏ జన్మాంతర వాసనా బలమొ, నాకేనా(టి సంబంధమో
పూజాపత్ర పవిత్ర భాగ్యమిడి ఆమోదించె శాకాళి, నా
సౌజన్యంబును త్రుంచి వాసనల ఆశల్ తీర్చి స్నేహంబుతో
మోజుల్ తీర్ప(గ వేగి షడ్రుచులకై పుల్ చూపి మెప్పించవే?

పూవుల్ కాయలున్నయెడ భూజములన్నియు భూజనాళి సం
భావన పొంద( గ్గలుట స్వభావము, నాదగు జీవితంబులో
చేవను బొందె ఆకులు, వశీకృత సర్వజనాళి నాసికా
భావ విహార సంకలన భవ్యములైనవి నవ్యరీతులన్.

కుత కుతలాడు వేళ–తమకోసమె వాసననిచ్చు వేళ-స్నే
హితమునుగోరి మీ కొఅకునే తపియించుమనున్న వేళ–నా
జతకయి ప్రాకులాడితిరి శాకములార! మహాభిమానులౌ
మతి మతులార! మైత్రియను మాటకు నర్థము మీరలేసుమా.

అనసూయాసతి ఇన్పగుగ్గిళలు సౌహార్దంబుతో వండి అ
మ్మునికిం బెట్టడి వేళ నన్ను కరివేముం జేర్ప–తాలింపు గు
ప్పని యీరేడు జగాలు వ్యాప్తి(గనె, ఆస్వాద్యాద్భుతానంద జీ
వన వాసంత శుభోదయంబులవి నా భాగ్యోదయారంభముల్.

ఒక శాకంబననేల అన్నియును ఓహో యంచు మన్నించు, ఉ
త్సుకతా భావముతోడ పొంగునవి సంతోషంబుతో వారు రూ
పక నానావిధ షడ్రసంబులు! మహాభాగ్యంబుగానన్ను-ఎ
న్నికతో( జూచెను, పూర్వపుణ్యములు పండెన్నబ్బె సౌభాగ్యముల్.

మనుజుని వాడుకొంట, అనుమానము లేక త్యజించుచుండుటే
ఘనతర లౌక్య జీవితముగా తలపోసిన మానవుండు స
జ్జనుల కృతజ్ఞతా సహిత సాదర సుస్థిర స్నేహ పుష్ప వా
సనల నెఱుంగునా? జలజ సౌరభ మెంచుట కప్పనేర్చునా?

నా రసముల్ సువాసనలు నల్వురికై యిటులందఁ జేసి; ని
స్సార విశోషితాత్మనయి శోకములో పడియున్నవేళ-నే
భారమునైతినా? పరుల పంటికి కంటికి వేదునైతినా?
ఏరుట పారవేయుటిదియే కళ యౌనా కృతఘ్నతా నిధీ!

దూసిన బాధలేదు, కనుదోయి వెలుంగున దోస మెన్నఁగా
వీసము క్రుంగలేదు, తనువే కడు వేడిని వేగువేళ నే
గాసి పడంగలేదు, రుచికై నను బారున వేసి గాచ; ఆ
యాసము చెందలేదు, ఇది హత్యయె, ఏరుట, పార వేయుటల్.

పాఁడి కాలము చెల్లిన పాడియావు
పాల కావడి మోసిన బరువురాయి
జ్వరము పోయిన వెన్క భిషగ్వరుండు
పరగ నిల్చిరి నాదైన వరుస యందు.

# పైడిపాటి సుబ్బరామశాస్త్రి

## వసంతము

క్రింది నుండియు పైకి కేవలమ్ముగ పూచి
మాకంద మొక్కటి మహిమ జూపె
ఒక్క మాకందమ్ము లిక్కించి పర్ణముల్
గొనబు చూపుచును దీప్తిని వహించె
ఓలింపులై పిందె లొక్క మాకందమ్ము
స్పందనన్ కన్నుల విందు జేసె
కాయల బరువు నిష్కంపమ్ముగా నిల్చె
మేలైన ఒక్క రసాల తరువు
ఆతపము బారి తప్పించి యాశ్రయమ్ము
నిచ్చు నామ్రమ్ము పథికుల కెంతయేని
శ్రమము వోవగ జేయు నాచ్ఛాదనమ్ము
సంతసము గొల్పునట్టి వసంత వేళ.

కసటువో చూతంపు కిసలయమ్ముల మెక్కి
కొమ్మపై పికమొండు కూయుచుండ
వేఱొక్క కోకిల వేఱొండు తరువుపై
కూర్చుండి బదులుగా కూయునంత
ఆమ్రవృక్ష చ్ఛాయ యందున్న బాలురు
నంత కోయిల కూతలనుసరింప
కోకిలమ్ములు రెచ్చి, కో కో కా కోయంచు
మధుర కూజితముల మనసునింప
విరహిణులు కూత కూతకు బెదరి పోయి
బెదరి పోయిన మనసుల బిక్క బట్టి
ఉస్సురనుచునె నొక కాంత యోర్చుకొనుచు
చింత మునిగెదరంత వసంత వేళ.

## మల్లెల గురవయ్య

### అభినవ పాలక(ము)లీల

అభినవ పాలకుల్ జగమునందు ననేకులు వారికిన్ సుదు
ర్లభమగు కీర్తికై పెనుగులాట నిరంతరమంతరంగ మం
దభయమటంచు దౌష్ట్యమున కన్ని విధమ్ముల రక్షనిచ్చి తా
రుభయ వినష్ట మార్గమున కుత్సుకు లౌదురిదేమి వింతయో.

మెత్తని వారిఁగాంచి తమ మేదుర దర్పముఁ జూపునట్టి యు
న్మత్తులు, పాలనమ్ము నెడ మాంద్యముఁ బూనిన పాలకుల్, మహో
దాత్తుల బారుదత్తుఁ దలఁదన్ను గుణాఢ్యుల నెత్తి నెక్కిపై
మొత్తుచు, లేని నిందలను మోపుచు సంస్థ నొనర్తు సంతగా.

సంత సేనగా వసంత సేనల పైన దాడిసలుపునట్టి తనదు ప్రజల
చూచి చూడనట్లు సోయగమ్ము వెలార్చు, అతని ప్రభుత మర్మజుని
కెఱుక.

మును ప్రజాపతి తనుఁబోలు వినుత యశుల
కప్పగించెను సృష్టి బాధ్యత యటంచు
తా శకారుల బోలు నధార్మికులకు
రాజ్యపాలన మొసఁగి విశ్రాంతిఁగనును.

మంత్రాలోచన వేళకుఁ
దంత్రపరులఁ జేరఁదీసి తలయొగ్గు; మహా
మంత్రుల మంత్రములెల్ల స్వ
తంత్రత కవరోధములుగఁ దలఁచుఁ గుమతియై

పనికి మాలిన శాసన ప్రాతినిధ్య
మును వహించి మంచికి స్వస్తి మున్నె పలికి
తాను బట్టు కుందేటికి తప్పకుండ
మూఁడె కాళ్ళని వాదించు మూర్ఖ బుద్ధి.

నటగాయక విట చేటకులెటు చూచిన కొలువు కూట మేర్పడి యుండన్
తటపటమని తప్పెటధ్వని పటుతరముగ మ్రోగుకరణి భాషించు సదా.
నెలకు పదునైదు దినములు సెలవుల వలె నింటఁగడపి సిద్ధిప్రదుఁడై
సెలవన్న సాధుజనులను నిలువున దహియింపఁజూచు నిప్పులు లేకన్.

బౌద్ధ మతమన్న నతనికి పట్టఁబోదు
బ్రాహ్మ్యమతమన్న మిగుల చిరాకు గల్గు
స్వజన పక్ష పాతమె ప్రతిష్ఠాపనముగ
నతని దొాక నూత్నమతమది యగణితమ్ము.

జీర్ణోద్యానములెల్ల న
పర్ణములై నవవసంత వైముఖ్యములై
చూర్ణ వికీర్ణములయ్యెన్
దుర్ణయులై వెలఁగు కతన నూత్న శకారుల్.

ఆఱు మూఁడన తొమ్మిది యనునెగాని
అతని పాలన మాఱుమూఁడగుటెఱుఁగఁడు
ఐదు పదియయ్యెనన నెట్టులనునె కాని
వీరుఁడై తాను ముందంజ వేయఁడెపుడు.

పంచ బంగాళమనఁ దన పద్ధతి మెయి
గణన మొనరించి యైదు బంగాళములను
నంతియేగాని రాజ్యమిట్లయ్యె ననుచు
తలఁపఁడది యేమి కర్మమో, దైవ మెఱుఁగు.

తెలుఁగుపైఁ బ్రీతి సున్న పై ప(కు)లుకు తప్ప
బాస తుది రెండు వర్ణముల్ వ్యత్యయముగ
తెలుగు తెగులయ్యె నార్భాటములు మిగిలెను
దేశమే నాశమయ్యె తద్దృష్టి కతన.

అతని యాస్థానమ్మున
జ్యోతిష్కులకున్న విలువ బోద్యమ్మగుఁదాఁ
జేతులను బాపి చూపుచు
భూతమ్ముల రాజుఁగొలుచు భువనములేలన్.

పగటి వేషాల వేయుచుఁ బ్రభువు తాను
మురిసి పోవును గొప్ప సంస్కరణమనుచు
మాటి మాటికి వెలిబూది మాట చెప్పి
శూన్య హస్తముల్ చూపి భిక్షువునని యను.

మును సంవాహకులగు వా
రినిగని తన పాదపూజఁ బ్రీతి మెయిన్ స
ల్ప నియోగించుచు సన్న్యా
సిని నే రాజర్షిననుచుఁ జేర్చు శ్రమణులన్.

అధికారులు నిజముగ నేఁ
డధికారులె యిది సవర్ణమునై సంధిలి దు
ర్విధి గుణరాహిత్యమునన్
వ్యథలఁ బ్రజకు వృద్ధి సేయు నభినవ విభుతన్.

# చేబ్రోలు చిన్మయబ్రహ్మకవి

## కావ్యసరస్వతి

పద్మావతీ మనః పద్మ బాంధవ కటా
క్షాంచల దీప్తి నింపారఁ గాంచి
తుంగభద్రా సరిత్తుంగ తరంగోచ్ఛ
లిత పవనాంకూరతతి వహించి
కవి దిగ్గజేంద్ర ప్రకర్షా ప్రబంధ స
ల్లాప వేషా సమారంభ మెంచి
నృప భామినీ రమణీయ మందిర పంజ
రస్థ శుకీ కంఠరవళి నించి
శిల్ప సౌందర్య ముద్రతా శేష కుడ్య
గోపుర ప్రాంగణోద్యానకుంజ నిబిడ
మాంధ్ర సంగీత నృత్యాలయంబు కరము
మురిసి మేల్కాంచె విద్యానగర పురంధ్రి.

తెలుఁగు మగంటిమిన్ గళల దీధితులన్ గవితా సరస్వతీ
చలదనవద్య మాధురి, దిశల్ నలుమూలల నింపినట్టి రా
యల భవనేందిరా విభవమట్టిది యిట్టిదటంచుఁ దెల్పఁగా
నలవి యొకింత లేక యలరారె మనోజ్ఞ కళాభిరామమై.

హాయి హాయిగ శ్రావ్యమైన రాగంబుల
తీయందనాల సౌన్నాయి పాట,
ఉల్లముప్పొంగఁగా నుజ్జ్వూతలూఁగించు
రంగ దుత్తుంగ మృదంగరవళి,
విజయోత్సవ ప్రీతి వేడ్కమించెడునట్టి
వీరతా పూర్ణ భేరీరవంబు,
భావనాంతరములఁ బరవశింపఁగఁ జేయు
నూత్న మనోజ్ఞ వేణుస్వరంబు

లోదవ హెగ్గడికాండ్రు ముమ్మొదట నడువ
మంత్రి మణివెంట, సింహ సమాన గమన
మున విభుఁడు పాదచారియై యనుగమింప
వరుసఁ దోఁతెంచె నల్లనఁ బరిజనంబు.

వినుత కవీంద్రులతోఁ బె
ద్దనకవి రాజేంద్రురాకఁ దనివొందుచు, ముం
దునకున్ బదియడుగులు వ
చ్చె, నితాంత రసజ్ఞతా విశిష్టత నటకున్.

రాయల ముఖపద్మముపైఁ
దీయని చిర్నవ్వు మొలిచెఁ దిమ్మరుసు యశ
శ్శ్రీ యొదవంగర బాలన
మాయెడ నొనరించెను, గవి యానందింపన్.

సద్దు మణిఁగెనంత సాహితీ ప్రియుడాంధ్ర
భోజుఁడడుగు వెట్టెఁ బుణ్య సుకవి
రాణ్ణికేతనమున, రమ్య కుసుమ వృష్టి
కురిసెఁ గృష్ణ కల్పతరువు మీఁద.

అతుల శిరీష పేశల సమంచిత పాకమునన్ రచించి, వి
శ్రుత కవితా పితామహ యశోధనుఁడైన కవీంద్రుఁడా మహా
కృతిపయి నిన్నియక్షతలుదీర్ణతఁజల్లి యొసంగ, బాష్ప పూ
రిత నయనాల కద్దికొనెఁగృష్ణ విభుండనురాగ మూర్తియై.

అమ్మనుచరిత్ర నంది, ము
దమ్మలరన్మంత్రి వరుఁడుదంచిత లీలన్,
నెమ్మదిఁ బల్లకి నుంచెం
గమ్మని కర్పూర చందనము లొల్కు నటుల్.

అంకిత మంది, రాయలరుదార నసర్ఘ సువర్ణ రత్నముల్
పొంకము మీఱు దువ్వలువలుంగవిమౌళికి నందఁజేసి, మీ
నాంకుఁడు క్రొత్త పెండ్లికొడుకా! యన లేనగవుల్ నటింపఁ బ
ల్యంకిక కొమ్ముఁబట్టె; హృదయ ప్రియ శారద నేలు నట్లుగన్.

ముక్కున వ్రేలిడిరి విబుధు
లక్కమలాక్షులు రసజ్ఞతాంచితవైర
మ్మక్కువ ప్రభువుల కుండుట
యక్కజమని తిమ్మనాదులనుకొని రచటన్.

కవితాశిల్ప విశిష్ట గాన సుదతీ కౌతూహలోత్ఫుల్ల గౌ
రవ లావణ్యములెల్ల నీ ప్రభుతలో రాణించె, సాహిత్య సౌ
ష్ఠవముల్ నీ పదచారణంబుననఁ బ్రస్తావించె నౌరౌర! యి
ట్టివి ముమ్ముందుననఁ దారసిల్లఁ గలవే! ఠీవిన్గుబాళించుచున్.

ప్రజల నాదుకొన్న నిజ బాహుబలము, వా
గ్దేవ తనలరించు ధీపటిమయు,
నరి భయంకర సముదాత్త శౌర్యంబు నీ
వేయనంగఁ జెల్లుఁ గృష్ణరాయ!

నీ పరిపాలనోన్నతి గణించె మహాంధ్రము వీరభూమియై
యేపు వహించె నీ యుగమహీన కళారమణీ ప్రసన్నమై
తేపకు నీ చరిత్ర నినదించెడు నల్లదె! తుంగభద్ర
మ్యాపగ వీచికాతతులనాహ! కృతార్థుఁడవైతి వింతకున్.

## రసరాజు

### వక్రించిన వర్తమానము

సమతను నిల్పి, జన్మకొక సార్థకతన్ గలిగించు భక్తి సం
ఘములు, మనోవికాస సుమగంధము బంచి వెలుంగు సత్కళా
సమితులు, విద్దెలన్ గఱపు సంస్థలు కూడ, దరిద్ర రాజకీ
యములకు తావులై నిలిచె నక్కట! ఎంతటి శోచనీయమో!

ఇది పాపంబిది పుణ్యమార్గమని యొక్కింతేని యోచింపకే
మదికిన్ దోచిన త్రోవలందు తమ సేమంబొండె కాంక్షించుచున్
పదముల్ నిల్పెడి స్వార్థశక్తుల జయధ్వానంబు లెవ్వేళ, బు
ద్బుదముల్ రీతి నశించునోకద! శుభంబుల్ నాడు సిద్ధించెడిన్.

సారమొకింతలేని విరసమ్మగు ప్రేమ బజారు రోడ్ల, శృం
గారము పేర నర్తిలుటకంటె సమాజమునందు వేరు సం
స్కారము లేదు నేడు, పయిసా పరమాత్మ, భవిష్య కాలమే
తీరున జాతి జీవితము తీరిచిదిద్దునొ చూడగావలెన్.

ప్రాణము నిల్పు నౌషధములం గలితీ యొనరించునట్టి వి
జ్ఞానము బారసాచిన విషణ్ణ దినాలివి, డబ్బుకోసమై
మానవతా పవిత్రిని సమాధిని పూడ్చుట నేర్చు కొన్న అ
ధ్వాన పరిస్థితుల్, బ్రతికి బట్టను కట్టిన జాతి నిల్చునే!

వంచన లేనిదే బ్రతుకు బాటల కాలిడలేని రక్కసుల్
మించిన దేశమందు కుసుమించునె మంచితనంబు! జాతి సా
ధించినదేమియో తెలియదే! మన గమ్యము మారిపోయె! "వ
క్రించిన వర్తమానము" లిఖింపక పోరు చరిత్రకారులున్.

## పి. సి. రాములు

### పరిణయము

మావులు పల్లవించె నవమల్లిక లింపుగ సొంపునింపె క్రొం
దావులతో సమీరకుడు తా నరుదెంచె, నుగాది శోభతో
జావళి పాడె నా పికము వారు కవిత్వము చెప్పె కీరమున్
భావ సుగంధ మాధురుల పంచె సుమంబు వసంత వాటికన్.

పచ్చని తోరణాలు, విరి పాన్పులు కోకిల భావగీతముల్
విచ్చిన పైరగాలి నులివెచ్చని తావుల కౌగలింతలున్
ముచ్చటగొల్పు కీరములు మోహినులై యలరారు పూవులున్
అచ్చెరు వందగన్ మదికి హాయిని గూర్చు మయూర నాట్యముల్.

సుమధుర చూత జొంపముల జొక్కి పికంబు సుఖంబు పొందగా
నమరరసాలగ్రోలుచును హాయిగ కీరము పొంగి పోవగా
సుమములు సుందరంపు వసు శోభదలిర్పగ నుత్సుకంబుతో
సుమశరు డేగుదెంచె వనసుందరి నింపుగ పెండ్లియాడగన్.

మల్లెలు పందిరేసె ఎలమావులు తోరణ పాళిగట్టె నా
యల్లరి పిల్లగాలి దరహాస పవిత్ర సనాయి పాడె నా
చల్లని వెన్నెలంతయు దిశాతతి యంతట పీటవైవ తా
మెల్లగ జేరె లక్ష్మిని సమీరుడు చక్కిలిగింతి వెట్టగన్.

చిలుకలు వేద మంత్రములు చెప్పగ మావి చివుళ్ళ జ్యోతులై
వెలుగులు జిమ్మగా భ్రమర వీరులు పుష్పరజంబు మెల్లగన్
జిలుక శిరాల, పూవులను శ్రీమతులందరు పేరటాండ్రునై
కలికి సుచైత్ర లక్ష్మికి సుఖమ్ముగ పెండిలి చేసి రందరున్
చలి జన నేగుదెంచిన రసజ్ఞుడు మన్మథ సుందరాంగుతో

— O —

# ఎదేతిమిా

[ఎదేతిమిా అనే అతడు ఓయో చక్రవర్తి సేనాని. సరిహద్దుల్ని కాపాడటానికి వెళ్ళిన తిమిా, ఎదే అనే పట్టణాన్ని కట్టి స్వతంత్రుడయ్యాడు. పశ్చిమ ఆఫ్రికాలోని యొరుబా జాతి ప్రజలు తిమిాని హాస్యాద్భుత రసాలతో కొనియాడే గీతం ఇది]

ఒక పుట్టని మ్రింగేటంత దేహంతో పెద్ద ఆకారం నీది
నీ పొట్టంతా యుద్ధాలతో ఉబ్బింది
నీ పళ్ళు తప్ప తక్కిన ఒళ్ళంతా కారునలుపు.

చెట్టు కొమ్మమిాద కూర్చోకుండా
కోతినెవడూ ఆపలేడు.
గద్దెను గూర్చి నీతో ఎవడూ గుద్దులాటకు దిగలేడు
నీతో జగడానికి ఎవడూ ముందుకు రాలేడు.

చెట్టు బోదెను ఊపేవాడు తనని తానే ఊపుకుంటాడు
నిన్ను ఆపడానికి మేం ప్రయత్నించం
పులిజూదంలోని చింతగింజలు
గెంటి వేయబడ్డామని ఫిర్యాదు చెయ్యవు.

మనిషి కనుగ్రుడ్లని హఠాత్తుగా పెరికి వేసే
మరణంలా ఉన్నావు నువ్వు.
ముందర ఒక యుద్ధం చేస్తూనే
వెనకాల తరువాతి యుద్ధరంగాన్ని గుర్తిస్తావు
నా ప్రభూ! దయవేసి ప్రపంచానికి విశ్రాంతి నియ్యి.

ఎవడేనా నీకు నమస్కారం పెడితే ప్రమాదం
పెట్టక పోయినా ప్రమాదమే!
నువ్వెక్కడి కెళ్ళినా
విధ్వంసాగ్ని నీ సామాన్లలో ఒక భాగం

మట్టగిడసని రెండుముక్కలుగా తరిగినట్టు
నీ శత్రువుల్ని నువ్వు మెత్తగా చంపుతావు
చిరుతపులి (జింకపిల్లని) చంపుతుంటే
దానితోక నేలమీద మెల్లగా ఈడ్చుకుంటుంది.
నువ్వు నోరు వెడల్పుగా తెరిచినప్పుడల్లా
ఒక వీరుణ్ణి మ్రింగేస్తావు!

(ఉల్లీ బియర్ ఆంగ్లానువాదంనుంచి తెనిగింపు—తంగిరాల)

బ్లాక్ అమెరికన్ కవిత

## కాల్విన్ హెర్నెటన్

### సుదూర భేరి

నేను అలంకారం కాను, ప్రతీకా కాను
నువ్వు వింటున్నది చెట్లలోని గాలి కాదు,
వీథిలో కుంటిదిగా చేయబడుతూన్న పిల్లీ కాదు.
నేను కుంటి వాణ్ణిగా చేయబడుతున్నాను నడి వీథిలో
ఏడ్చేది నేను, నవ్వేది నేను,
సుఖదుఃఖాల ననుభవించేది నేను,
నేను ఉన్నాను కాబట్టి
దీన్ని చెపుతున్నాను.
ఇది నాకంఠం.
ఈ మాటలు నా మాటలు,
వీటిని నా నోరు మాట్లాడుతుంది,
నా చేయి వ్రాస్తుంది–
నేను కవిని.
నువ్వు వింటున్నది నీ చెవిని
గ్రుద్దుతున్న నా పిడికిలిని!

(ఆంగ్లమూలంనుంచి అనువాదం—తంగిరాల)

క్రీ.పూ. 14 శతాబ్ది నాటి ఈజిప్టు కవిత

# ప్రేమగీతం

నన్ను ప్రేమించే ఆ యువకుడి యింటిముందునుంచి వెళ్ళాను
తలుపు తీసి వుండడం చూశాను.
తన అన్నదమ్ముల మధ్య అక్క చెల్లెళ్ళ మధ్య,
అతడు తన తల్లివైపు కూర్చున్నాడు.
ఆ దారిని పోయే ప్రతి యువతీ అతన్ని ప్రేమిస్తుంది.
అతడు మంచి కోడెకాడు, సాటిలేని నీటుకాడు,
అపురూపమైన శీలంతో కూడిన వలపుకాడు.
నేనా యింటిముందునుండి వెడుతూంటే ఎంత కన్నార్పకుండా చూశాడు నన్ను!
(నేను బయట నడుస్తున్నాను నా అంతట నేను, నా సొంత సంతోషకోసం)
నా ప్రియతమ ప్రేమికుడా! నా కన్నులు నీ మీద వాలినప్పుడు
వలవంతలో ఎంతగా నా హృదయం గంతులు వేసిందో!
ఆహా! నా హృదయంలో ఏముందో మా అమ్మకు మాత్రమే తెలిస్తే
ఆమె మెరుపులా వెళ్ళి అతణ్ణి చూస్తుంది!
ఓ స్వర్ణదేవతా! ఆమెలో ఈ ఆలోచన ప్రేరేపించు!
ఓహో! నేనెంతగా కోరుకుంటున్నానో నా ప్రియుడి దగ్గరికి వెళ్ళాలనీ,
అతడి కుటుంబం ముందే అతణ్ణి బహిరంగంగా కౌగిలించుకోవాలనీ,
లోకుల ప్రవర్తనకి ఇక మీదట ఏడవ కూడదనీ,
మేమిద్దరం పరస్పరం ప్రేమించుకున్నామని
చివరికి ప్రతివ్యక్తీ తెలుసుకుంటాడు కాబట్టి సుఖంగా ఉండాలనీ.
నా దేవత గౌరవార్థం ఒక చిన్న ఉత్సవం చేస్తాను!
ఈ రాత్రి తిరిగి బయట తిరగాలనే ఆలోచనతో నా గుండె ఇప్పుడు నిప్పుల మీద ఉంది
నా ప్రియుని ఈషద్దర్శనం మరోసారి పొందేందుకు ఉవ్విళ్ళూరుతోంది....

(జె. ఇ. మాంఛిప్ వైట్ ఆంగ్లానువాదానికి తెనిగింపు —తంగిరాల)

రష్యన్ కవిత

## కాన్‌స్టాన్‌టిన్ వాన్షెన్కిన్

వదిలి పోడానికి బాధపడతాను
ఈ విశాలలోకాన్నీ, ఈ అన్నిముఖాల్నీ,
ఈ సమస్త పృథివీ సౌందర్యాన్నీ ఈ సంతోషాల్నీ
ఇవన్నీ ఇంతవరకూ నావి
నేను చవిచూచేవి,
వీటిని వదిలి పోడానికి
నేను బాధపడతాను.

మరపనే క్రూరమైన త్రాడుతో
జ్ఞాపకాల కాలువల గొంతులు నులుమ బడతాయి,
కాని—అ పాత అకుల పొగ నువ్వు వాసన చూస్తావు,
కాలం రెక్కల మీద కొట్టుకొని పోయిన పాట వింటావు,
జీవితం ఇంకా ఆశతోనిండి వుంది.

(రైస్సా బబ్రోవా ఆంగ్లానువాదంనుండి తెనిగింపు—తంగిరాల

కన్నడ కవిత

## కె. ఎస్. నిసార్ అహమద్

### గతి

ఒకడు—
సతతమూ సాగిపోవడమే బతుకని
వెళ్ళాడు వెళ్ళాడు వెళ్ళాడు
అటూ ఇటూ ముందూ వెనకా చూడకుండా
వెళ్ళాడు.
చంద్రుడూ సూర్యుడూ ఉదయిస్తూనే ఉన్నారు
వాటి ధ్యాసే లేదు.

ముందడుగు
అలవాటయింది, స్వభావమయింది
తరులు గిరులు సముద్రాలు
కొత్త భూమి, కొత్త జనం
కొత్త నడక.... ఏది ఏమైనా
నిలవనే లేదు.

ఒక చోట
అస్పష్ట స్మృతి ప్రగతికి అడ్డమై
ఎక్కడో చూచినట్టుందే ఈ ఆవరణం అని
ఆలోచిస్తే
బయలుదేరిన చోటే అది.
అలవాటే స్వభావం కావటాన్ని ఒక్కక్షణం
మరిచిపోయి
పసి అడుగు అక్కడే నిలిపింది.
తెలిసిన వారూ తెలియనట్లు తప్పుకోగా
"ఎవరీ కొత్త మనిషి"
అని మిగిలిన వాళ్ళు చుట్టుముట్టారు.

నెరిసిన గడ్డాలు మీసాయి
ముడతలు పడ్డ దేహం
రాలిన పళ్ళు
బలం
తలచుకొని ఏడ్చాడు
"చనిపోతే ఎవరు బాబూ దిక్కు?"
అని జరగ బోయే దాన్ని
తలచుకొని ఏడ్చాడు.

(కన్నడంనుంచి తెనిగింపు—సుందరం)

## షూవోషి

1. కలల్లోంచి మేలుకొని చూస్తే
వెరగుకొల్పే చిక్కని చీకటి:
ఆకులు రాలే కాలం – సాయంకాలం.

2. కొండ చిమ్మటలు
దీపంచుట్టూ ఎగరవు
చందమామ చుట్టూ ఎగురుతాయి.

3. చనిపోయిన ద్రాక్షతీగ
ఏటికెదురీదుతూ
ఆవలి ఒడ్డు చేరాలనుకుంటుంది.

## సైషి

1. ఆకులు రాల్చే గాలి
అటు వెళ్తుంది—
పసి బాలుడొకడు కళ్ళు తెరుస్తాడు.

2. పగటిపూట ఒక చీమను చూచాను
ఈ చీకటి రాత్రి
అది నా మనస్సును తొలుస్తోంది.

3. నా మధ్యాహ్నపు కునుకులోకి
మళ్ళీ మళ్ళీ ఎవడో
మేకులు దించుతున్నాడు.

4. నేనొక యువతితో ఈదులాడాను
అయినా – ఈ అలల్లో
ఏ గుర్తులూ లేవు.

(మకోతో ఉవేదా అంగ్లానువాదంనుంచి తెనిగింపు—సుందరం)

వెలుగు చీకటిగా మారుతుంది,
రేయి, మళ్ళీ మళ్ళీ రేయి,
రేపు మళ్ళీ ఆకలి నిండిన పగలు;
పైవాడికి మామీద కోపం.
పెద్ద వాళ్ళంతా వెళ్ళి పోయారు,
వాళ్ళ ఎముకలు చాలాదూరం, ఎక్కడో పాతాళంలో.
వాళ్ళ ప్రేతాత్మలు తిరుగుతున్నాయి-
ఈ ప్రేతాత్మలు ఎక్కడ తిరుగుతున్నాయి?
బహుశా కదిలే గాలికి తెలుసు.
వాళ్ళ ఎముకలు చాలాదూరం, ఎక్కడో పాతాళంలో.
వాళ్ళు పాతాళంలో ఉన్నారా, ఆ ప్రేతాత్మలు—అక్కడే ఉన్నాయా?
మేము సమర్పించేవన్నీ వారు చూస్తున్నారా?
రేపు శూన్యం, దిగంబరం;
ఎందుకంటే పైవాడు అక్కడ లేడు,
తిండి పెట్టేవాడు పొయ్యిముందు లేనే లేడు.

(ట్రిల్లెస్ అనువాదంనుంచి తెనిగింపు—సుందరం)

— O —

"నియతికృత నియమరహితాం హ్లాదైకమయీమనన్య పరతంత్రాం
నవరస రుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవేర్జయతి"

కె. గోదావరి శర్మ
అద్దేపల్లి రామమోహనరావు
శేషేంద్ర
డా. గుమ్మనూరు రమేష్‌బాబు
రఘువర్మ
డా. సి. నారాయణ రెడ్డి
చల్లా రామఫణి
భువనగిరి నాగరాజు
జి. ప్రభాకరస్వామి
ఎస్. శ్రీనివాస్
ఆర్. సీతారామారావు
టి. శ్రీరంగస్వామి
కోట్ల వేంకటేశ్వర రెడ్డి
డా. పేర్వారం జగన్నాథం
డా. పరగు కృష్ణమూర్తి
ఆర్వీయస్. సుందరం
ఏ. శ్రావణ్ కుమార్
ముదివర్తి కొండమాచార్యులు
డా. తుమ్మపూడి కోటీశ్వరరావు
టి. వి. కె. సోమయాజులు
డా. మల్లెల గురవయ్య
రసరాజు

ఆచార్య మాదిరాజు రంగారావు
యస్. యమ్. వి. ఆర్. జి. కృష్ణస్వామి
నిఖిలేశ్వర్
మంతెన సూర్యనారాయణరాజు
ద్వా. నా. శాస్త్రి
కె. కిశోరుబాబు–కె. అశోకుబాబు
సౌభాగ్య
డా. ధారా రామనాథశాస్త్రి
డా. డి. రాజేశ్వరి
ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ
పి. వి. ఎస్. ఆర్. కె. శర్మ
డా. తంగిరాల సుబ్బారావు
సోమసుందర్
ఎ. ఎన్. నాగేశ్వరరావు
కీ. శే దేవరకొండ బాలగంగాధర తిలక్
డా. శ్రీనాథ్
కళాప్రపూర్ణ మధునాపంతుల
సత్యనారాయణ శాస్త్రి
కీ. శే. టి. బి. యం. అయ్యవారు
పైడిపాటి సుబ్బరామశాస్త్రి
డా. చేత్రోలు చిన్మయ బ్రహ్మకవి
పి. సి. రాములు

ఇంకా ఆఫ్రికా, బ్లాక్ అమెరికన్, ఈజిప్టు, రష్యన్, కన్నడ, జపాన్, పిగ్మీ కవితలు.